యువభారతి ప్రచురణ

సాహితీవాహిని పరంపర



# కుందుర్తి కవితా వైభవం

అద్దేపల్లి రామమోహనరావు

# కుందుర్తి కవితా వైభవం

రచన

డా॥ అద్దేపల్లి రామమోహనరావు

ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం : 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

KUNDURTHI KAVITA VAIBHAVAM
Poetc Selcticns fom Kundurthi Anjaneyelui's Works.
By Dr. Addepali Ramamohan Rao



యువభారతి

ప్రచురణ : 65
ప్రథమ ముద్రణ :
రౌద్రి ఉగాది
17 మార్చి 1980
ప్రతులు : 1,200
ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు.
ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్.
ముఖచిత్ర ముద్రణ :
గీతా ఆర్ట్ ప్రింటర్స్,
హైదరాబాద్.
ప్రతులకు :
యువభారతి
5 కింగ్స్‌వే, సికింద్రాబాద్ - 500 003.
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001
వెల రూ. 3/-

---

Paper Used for the Printing of these books
was made available by
the Government of India at concessional rate.
YUVABHRATHI IS GRATEFUL

---




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగినపుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదహారేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతర సాత్త్విక సాధనంలేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 61 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులను పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే- యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 6000 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 700 మంది, భారతీ భూషణులుగా 60 మంది చేరారు.

ఉడుతా భక్తితో మేము చేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషా ప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం పెంపొందించాలని ఆకాంక్షిస్తున్నాం. సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ-

హైదరాబాద్
17-3-80

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు : యువభారతి

# మామాట

మనుష్యులెందరో చెప్పవచ్చు కాని మనిషి ఆలోచనలు ఎన్నో చెప్పలేము. ఆలోచనలను ఎన్నలేము సరికదా అవి మనిషినుండి వెలుపలికి వచ్చేవరకు వాటి స్వరూపస్వభావములను గూర్చి కూడా చెప్పలేము. ఆలోచనల అంతర రూపం అంతుపట్టదు కాని బాహిర రూపం మాత్రం ఎన్నో విధాల బహిర్గత మవుతుంది. అందులో భాష ఒక విధమైన రూపం. భాష కేవలం భావ వినిమయానికే మొదు ఏర్పడింది. కాని రానురాను మనిషి వ్యక్తిత్వానికే అది దర్పణంగా రూపొందింది. భావాన్ని ప్రకటించుకోవడానికి మనిషి తన భాషను అనంత విన్యాసాలతో సమలంకృతం చేసికున్నాడు. అందమైన భావాలను ప్రకటించుకోవడానికి ఒక ప్రత్యేకమైన భాషనే సృష్టించుకున్నాడు. ఆ ప్రత్యేకభాష సాహిత్యమనిపించుకున్నది అది ఎన్నో భంగిమలతో నడుస్తుంది. అవే ఛందస్సులు. పరిమితకాలంలో లయబద్ధంగా వెలువడే వాక్యమో పద్యమో గేయమో అయితే కాలానికీ లయకూ లొంగక ఒకప్పుడు, ఆగి-ఒకప్పుడు సాగీ అర్థంతప్ప ఏ నియమాలనూ పాటించకుండా నడిచే వాక్యం వచనమో గద్యమో అవుతుంది. పద్యమైనా గద్యమైన వాహిక మాత్రమే. సాధనం మాత్రమే. రసాత్మకమైన వాక్యం కావ్యమే అవుతుందని బుద్ధిమంతుడెవడైనా అంగీకరిస్తాడు.

ఇటీవల అంటే ఒక నాలుగు దశాబ్దాలనుంచి తెలుగులో పద్యాన్ని వదలి వచనంలో రససృష్టిచేసి సఫలీకృతులైనారు ఎందరో మహాకవులు. వారిలో విశిష్ట స్థానాన్ని సంపాదించినవారు శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు. వచన కవితకు ఒక స్థాయినీ ఒక ప్రత్యేకతనూ అలనాడు బాణుడు కల్పించినట్లే ఈనాడు కుందుర్తి కల్పించగలిగారు. కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీతలు వారు. 1978 లో యువభారతి కుందుర్తి సాహిత్యవ్యక్తిత్వాలను గూర్చి శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారిచే ఉపన్యాసమిప్పించి 'నవోదయ లహరి' లో పొందుపరచింది. ఇప్పుడు శ్రీ రామమోహనరావుగారే యువభారతి

అభ్యర్థనను దయతో అంగీకరించి కుందుర్తి కవితావాహినిలోని కొన్ని తరంగాలకు రుచిర వ్యాఖ్యానాన్ని సమకూర్చి 'కుందుర్తి కవితావైభవం'గా రూపొందించి అందించినారు. శ్రీ రామమోహనరావుగారు ఆంధ్రాంగ్లభాషలలో నిష్ణాతులు. సహృదయ విమర్శకులు. మంచివక్తలు. తమ ఈ పుస్తకాన్ని ప్రచురించే అవకాశాన్ని యువభారతికి కలిగించి వారు తమ సాహిత్య ప్రణయాన్ని ప్రదర్శించినారు. వారికి మా కృతజ్ఞతలు.

పుస్తకానికి ముందుమాటను వ్రాసి మమ్ము ఆశీర్వదించిన మిత్రులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి మా హార్దికాభివందనములు.

ముద్రణకు తెల్లకాగితం దొరకని ఈ గడ్డురోజులలో పుస్తక ముద్రణకు అవసరమయిన తెల్ల కాగితాన్ని సరసమయిన ధరకందించిన భారత ప్రభుత్వము వారికి, ఆంధ్రప్రదేశ్ పాఠ్యపుస్తక ముద్రణాలయాధిపతులకు మా కృతజ్ఞతలు. ముఖ చిత్రాన్ని ముచ్చటగా తీర్చిదిద్దిన ప్రముఖ చిత్రకారులు శ్రీ శీలా వీరాజుగారికి మా నమస్సుమాంజలులు. పుస్తకాన్ని అందంగా ముద్రించిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్ గారికి, బ్లాకులను సకాలంలో అందించిన- శ్రీ అశోక్ గారికి ముఖ చిత్రాన్ని అందంగా ముద్రించి అందించిన శ్రీ గీతా ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ బోస్ గారికి మా కృతజ్ఞతలు.

భాషాబంధువులు యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని ప్రోత్సహిస్తూనే ఉంటారని ఆకాంక్షిస్తున్నాము.

హైదరాబాద్
17-3-1980

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.
యువభారతి

# ముందుమాట

అభ్యుదయ కవుల్లో వచన కవితా పరిణామానికి దోహదం చేసిన వారిలో శ్రీ కుందుర్తి మొదటి వరుసలో నిలుస్తారు. వచన కవితని ఒక ఉద్యమంగా భావించి, ఆ రూపాన్ని సుసంపన్నం చెయ్యడంలో నిర్విరామ కృషి చేసిన వారిలో కుందుర్తి ప్రముఖులు.

పాత కాలం పద్యమైతే
వర్తమానం వచనగేయం-

అన్న పంక్తులు ఆయనకి వచన కవిత మీద ఉన్న విశ్వాసాన్ని తెలియజేసై. కేవలం వచన కవితా రూపాన్ని ఒక ఉద్యమంగా భావించడం అతివాదమనీ, వస్తు సంబంధంలేని ఉద్యమం ఉండకూడదనీ, కుందుర్తిని కొందరు విమర్శించారు. అయితే, ఆయన నూటికి నూరుపాళ్ళు అభ్యుదయ భావాల్ని అంగీకరించిన తర్వాతనే ఆ భావాల్ని వెలువరించడానికి తగిన ప్రజారూపాలలో వచన కవితకి పట్టం కట్టడం జరిగింది. సామాజిక భావాల్ని ప్రజా సామాన్యానికి, వారి దైనందిన వ్యవహారభాషలో, భావనకృత్రిమత్వం లేకుండా అందించడం ఆయనకి ప్రధాన విషయం. అందుకు వచన కవిత సరియైన రూపమని ఆయన ఏనాటినుండో కలగంటూ వచ్చారు. ఆయన కళ్ళ ఎదుటే ఆయన భావించినంతటికంటె విశ్వరూపం ధరించింది వచన కవిత. కాని, యిందులో వచ్చిన కేవల ప్రయోగ శీలత్వాన్నీ, అనుభూతి వస్తువునీ, శిల్పప్రాధాన్యాన్నీ, కృత్రిమత్వాన్నీ, భాషాభారాన్నీ, పాశ్చాత్య అనుకరణల్నీ ఆయన హర్షించరు. ఎప్పటికప్పుడు ఖండిస్తునే ఉంటారు.

మొదటి వరుసలోని అభ్యుదయ కవుల్లో శ్రీ కుందుర్తిలో ఒక విశిష్ట లక్షణం ఉంది. తన కళ్ళముందు ఎన్నో ఉద్యమాలు, ఎన్నో భావనా ధోరణులు, తుఫానులా వీస్తుంటే, తాను తన అభిప్రాయాల్ని మార్చుకోలేదు. తన సిద్ధాంతాలూ, తన కవితా ప్రయోజనం, వాటికీ తన వ్యక్తిత్వానికీ ఉన్న సమన్వయం అపశ్రుతి పొందకుండా, స్థైర్యాన్ని ప్రదర్శించారు. మార్పు లేకపోవడం గొప్ప విషయం అనికాదు కాని, యితరేతర ప్రయోజ

నాలకోసం మార్పు చెందిన అనేకమందికంటె, తన లక్ష్యంపట్ల, తన వ్యక్తిగత ప్రవర్తనపట్ల చిత్తశుద్ధి ఏనాడూ విడిచిపెట్టని కొద్దిమందిలో ఆయన ఒకరు.

సామాజిక భావాలు ప్రధానంగా భావించడంచేత, వాటి ప్రచారం, ప్రబోధం తన ప్రయోజనం కావడంచేత, శ్రీ కుందుర్తిలో చాలా చోట్ల కవిత్వపు లోతులూ, స్పందనలూ ఆదేశాలూ, శిల్పరీతులూ తక్కువ స్థాయిలోనే ఉంటై. కాని, ప్రాచీన సాహిత్యాన్ని బాగా చదువుకుని ఆధునికతా వస్తువుని సంఘర్షణ పూరితంగా గాక, సామరస్యధోరణిలో చెప్పదల్చుకున్నాడుగనుక ఆయనలోనూ కొన్నిచోట్లఅయన ఖండించే శిల్పధోరణులూ, భాషాడంబరమూ కనిపిస్తూ ఉంటై. ఏమైనా ఆయన శిల్పాలన్నీ దేశీయధోరణికి చెందినవి. పాశ్చాత్యమైన ఆధునికతని ఆయన ప్రశంసించలేరు.

ఇటువంటి అభ్యుదయ కవిని గూర్చి 'కవితావైభవం' ధోరణిలో రాయడంలో చాలా కష్టం ఉంది. ప్రాచీన కవుల్నిగూర్చి రాయడంలో చాలా సౌలభ్యం ఉంది. పద్యాల్ని కేవలం శిల్పం కోసమే రాశారు ఆ కవులు. పైగా ప్రతి పద్యమూ ఒక కథా సంద్భరగతమైన సౌందర్య కేంద్రంగా గూడా ఉంటుంది. ఒక రమ్యమైన పద్యాన్ని తీసుకుంటే,కథా సందర్భాన్నీ, రసపోషణనీ, భాషా భావనా సౌందర్యాన్నీ వివరిస్తూ పోవచ్చు. కాని, కుందుర్తిలాటి వస్తుప్రధానుడైన కవిలో, దృక్పథాలూ, సిద్ధాంతాలూ, చెప్పేరీతిలో ఉన్న విశిష్టతతో అన్వయించి వివరించవలసి ఉంటుంది. అభిప్రాయాలు ప్రధానమైన కవుల కవిత్వాన్ని వివరించాలంటే, పునరుక్తి ప్రమాదంకూడా ఉంటుంది. ఎందుకంటే కథ ఉండదు కాబట్టి. సాధ్యమైనంతవరకు శ్రీ కుందుర్తికి గల సామాజిక సాహిత్య సిద్ధాంతాల్నిగూర్చి, ఆయన భాషాభావనావ్యక్తీకరణ విధానాల్ని గూర్చి ఆయన ప్రత్యేకతని వివరించే ప్రయత్నం యిందులో జరిగింది.

ఛందోబద్ధ కవుల్లో నీతిప్రబోధ పద్యాలు నోటికి రావడానికి అవకాశం ఉన్నట్టే, కుందుర్తి వచన కవితలో చెప్పిన అనేక ప్రబోధాలు జనవ్యవహారం లోకి రావడానికి తగిన లయనీ, భాషాసౌలభ్యాన్నీ కలిగి ఉంటై. ఆ వైచిత్రిని గమనించి, ఆయన సూక్తులు కొన్నిటిని విడిగా సేకరించాను.

కొద్దిలో ఒక కవి యొక్క సాధ్యమైనంత సమగ్ర రూపాన్ని ప్రజల కందిచ్చే 'యువభారతి' సంస్థ ప్రయత్నం గతంలో చాలా విజయాన్ని సాధించింది. అభ్యుదయ వచన కవులమీద ఇలాంటి 'కవితా వైభవం' శ్రీ కుందుర్తితోనే మొదలౌతోందనుకుంటాను. మిగిలిన అభ్యుదయ కవులమీద రచనల ఒరవడికి రేఖామాత్రంగానైనా సహకరిస్తే ఈ రచన సార్థకమని భావిస్తాను.

యువభారతి—వారు నాకీ అవకాశం యిచ్చినందుకు వారికి నేనెప్పుడూ కృతజ్ఞుణ్ణి.

అద్దేపల్లి రామమోహనరావు.

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

## మనుమణ్ణి ఎత్తుకున్న తాత

వీరశైవుల్లో పండితారాధ్యుడులాగా నేటి వచన కవుల్లో కుందుర్తి నాకు కనపడతాడు. మానవతావాదాన్ని మన్నించిన మార్క్సిస్టు దృక్పథం వారిది. వచన కవిత్వ ప్రయోగ వికాస వ్యాప్తులకు కులపతిగా ఒక విశిష్ట పాత్రను నిర్వహించి, వచన కవితాపితామహ బిరుదాన్ని సమకాలీన సాహిత్యంలో సగౌరవంగా పొందారు. వారు ఒక ప్రక్రియకు చిత్తశుద్ధితో అంకితం కావటమే కాకుండా, దాని సాహిత్యమూర్తిని సరళసుందరంగా తీర్చిదిద్దటానికి ఎంతో కృషి చేశారు. ప్రక్రియనూ ప్రవృత్తినీ అభేదప్రవృత్తితో సమన్వయించుకొన్న సాహితీ తపస్వి శ్రీ కుందుర్తి అంజనేయులు.

కుందుర్తి వారి కవితాధ్యేయాలను వారి మాటల్లోనే యిలా వివేచించవచ్చు:

1. కావ్యరచనావిధానంలో మార్క్సిస్టు దృక్పథాన్ని ప్రవేశపెట్టి ఏయే సత్ఫలితాలను ద్వారా కవిత్వాన్ని సాధ్యమైనంత ఎక్కువగా ప్రజల దగ్గరికి తీసుకవెళ్ళటానికి వీలున్నదో చూడటం.
2. కవిత్వం సారళ్యంతో తెలుగు నుడికారపుసొంపులతో వ్యావహారిక భాషాశక్తి సంపదలతో వర్ధిల్లేటట్లు చేయటం. ఆధునిక కవిత్వశైలి సామాన్య ప్రజల సంభాషణ స్థాయికి వచ్చేటట్లు చూడటం.
3. కావ్యవస్తువులు చైతన్యవంతమైన ప్రజోద్యమాలకు సంబంధించినవిగా ఉండటం.
4. రాజకీయ నాయకుల సిద్ధాంత విభేదాలతో తనకు నిమిత్తం లేకుండా తన విశ్వాసాన్ని నిర్భయంగా చెప్పటం.
5. వచన కవిత్వం సామాన్యప్రజల గాథలను, బాధలను ప్రతిబింబింప జేసుకోవటం.
6. స్థూలంగా మార్క్సిస్టు దృక్పథమూ, సోషలిష్టు వ్యవస్థకు అనుకూలతా, ప్రస్తుత వ్యవస్థను తప్పక మార్చాలనే దీక్షా, వీటికి సంబంధించిన ఊహాపోహలు సాహిత్య రంగంలో ఉండాలే కాని, సాహిత్యమంటే రాజకీయ సిద్ధాంతాల చర్చకు పెద్దపీట వేయరాదు. వ్యక్తిత్వాన్ని చంపే దిగా సంఘ నిర్మాణ ప్రియత్వాన్ని పెంచుకోరాదు.

కవికి మొదట దృక్పథం ఉండాలి. అతడు దాన్ని చెప్పే పద్ధతిలో ఒక ప్రత్యేకత ప్రదర్శింపబడాలి. అది ప్రజాచైతన్యాన్ని స్పందింప చేయాలి. అందువల్ల ప్రజల బాధల గాథలనది తనలో ప్రతిబింబింప చేసుకోవాలి. సమస్యలకు తరణోపాయం చెప్పినా చెప్పక పోయినా నిజస్థితినీ, ఉపాయాపాయాలనూ కవిత్వం కమనీయంగా చెప్పి జాతిని జాగృతం చేయాలి. రాజకీయం జాతి జీవిత సమగ్రవ్యాప్తి చెందిన వ్యవస్థ కానప్పటికీ, శాసనం దానిద్వారా నడవటం చేత, దాన్ని జగద్ధితంగా నడిపే వ్యక్తిత్వాన్ని ప్రజలలో సమాయత్తం చేయాలి. ఆ వ్యక్తిత్వం జాతివ్యక్తిత్వమైనా దానికి ప్రతినిధిగా కవి కలంపట్టి రాయాలి. ఆ ప్రతినిధి మాటలు ప్రజల నోట్లో పది కాలాలపాటు బ్రతకాలి. ఇలాంటి ఉదాత్త ఆశయాలతో శ్రీ కుందుర్తి వచన కవిత్వ ప్రక్రియను దాదాపు నలభై ఏళ్లుగా నడిపిస్తున్నారు.

కుందుర్తిగారి దృక్పథంలో ప్రయోగం ప్రయోగంకోసం కాదు ప్రజా ప్రయోజనం కోసం. వచన కవిత్వం సరళంగా ప్రజలను చేరుకునే శక్తిమంతమైన సాధనగా అయన భావించారు. సామాజిక స్పృహ ఆధునిక యుగానికి ఊపిరిలాంటిది కాబట్టి దాన్ని ఆయన మన్నించారు. ఆ ఊపిరిని వచన కవితకు పోశారు. ఊపిరికి కూడా ఒక నియతి ఉన్నదన్న సత్యం వారు గుర్తించారు. వచన కవితలోని అంతర్లయను అధ్యయనం చేసి అవగాహనం చేసుకోవటమే కాకుండా దాన్ని ఎన్ని హొయల్లో ఎన్ని విన్యాసాల్లో వెలార్చటానికి వీలుందో శిల్పదృష్టితో అనుశీలించి కల్పించి చూపించారు. ఈ ప్రయోగం ఉక్తికి శక్తిగా నిత్య వ్యవహార శబ్ద వృత్తిని వాచ్యలక్ష్య వక్ర వ్యంగ్య మార్గాల్లో మలచి బంగారానికి తావిలాగా నిలిపారు. ప్రతీకలు, భావచిత్రాలూ ప్రయోజనాత్మకంగా వాడి అభినవ కవితకు గౌరవాన్ని ఆపాదించారు. అలంకారం అలంకారం కోసం కాకుండా జీవితంనుండి కవిత్వానికి ఆలోచన రేకెత్తించే విధంగా అనుసంధించటం వారి నైజం.

కుందుర్తిగారి 'నయాగారా' లోని కవితా ఖండితలు వారి కవితాగ్ని సాక్షాత్కారంలోని విస్ఫులింగాలు. శ్రీశ్రీ అడుగుల్లో అడుగు వేసి నడచిన వైఖరి అందులో కనపడుతుంది. 'తెలంగాణ' వారి దృక్పథాన్ని చికిలిపెట్టి పదునెక్కించిన ఆధునిక ఉద్యమ కావ్యం. 'పరపీడన పరాయణత్వంలో' పడరాని పాట్లు పడ్డ మానవత ఘోషించిన మూగ రోదనలకు కవితా సమీక్ష

ఆ కావ్యం. ఉద్యమం దానికి నాయకుడు. సమష్టి చైతన్యం దానికి శక్తి. పద్దెనిమిది ఖండాల్లో సాగిన మరో చరిత్రలోని మహాభారత ఘట్టం! తెలంగాణలో కుందుర్తి వచన కవితలో ఉద్యమ చరిత్ర కావ్యాన్ని నిర్మించి వచన కవితా పితామహ బిరుదానికి అర్హులనిపించుకొన్నారు. తన బాట తనదిగా సాగే నాయకత్వం సాధించుకొన్నారు.

వారి 'ఆశ' భవిష్యత్తుమీద వారి విశ్వాసం. 'మానవజాతి భవిష్యత్తు స్వయంగా శ్రమించి నిర్మించుకోవలసిన మహాసౌధం. అందులో ఆశ ఉపాసనా దేవత. కాలం రాచబాట, చరిత్ర చరచరా పరుగెత్తిపోతున్న రథం, సామాన్య మానవుడు రథికుడు, కవి సారథి, జాతి జీవన పురోగమన నవచైతన్యం ప్రథమ సోపానం, సమస్త మానవాభ్యుదయ సాధన మన చరమగమ్యం'-అన్న మాటలు వారి ఆశా పథానికి అక్షయ లక్ష్యం. రూపక ప్రక్రియలో వచన కవితను వాడే ప్రయోగంలో ఈ కృతి సుకృతి. ''యుగే యుగే"లో కవితలు కుందుర్తి గారన్నట్లు ''ఎన్నడూ ఎవ్వరూ తొక్కని దుర్గమ పథాలు (నా) కవితా శపథాలు."

నాగరిక జీతాల్లోని నలుపు తెలుపులను చూపే నాణెమైన రచన ''నగరంలో వాన''. వారికి కీర్తి ధారలు కూడా జోరుగా వర్షించింది ఈ కావ్యం. ఎన్ని కవితలు వ్రాసినా, పద్యాలు వ్రాయనేర్చినా, వచన కవితకే జీవితాన్ని అంకితం చేసుకున్న కుందుర్తిగారికి సాహితీ సన్మానం లభించినప్పుడు వారు చెప్పిన కృతజ్ఞతావాక్యాలు వారి స్వీయ కవితా వ్యక్తికి వీర నీరాజనాలు.

''వచనకవిత విచారణలో
ఉరిశిక్ష పడ్డ మొదటి ముద్దాయిని నేను
అలనాటి కవితాలతాంగిని హత్యచేశాను
అలంకార ఆభరణాలు అపహరించాను
అన్నీ ఒప్పేసుకున్నాను ఆనాడు బోనులో ఎక్కి
క్రిందికోర్టు వేసిన శిక్షను
మానవకారుణ్య దృక్పథంతో సడలించి
జన్మఖైదు వేశారు హైకోర్టు న్యాయమూర్తులు.
ఒకతరంపాటు బ్రతకాలన్నారు బందీగా
పాఠకుల గుండెల చెరసాలలో ''

ఒకతరం వచన కవితా కీర్తి వరించిన కవితామూర్తి శ్రీ కుందుర్తి!

శ్రీ అద్దేపల్లి రాంమోహనరావుగారు కుందుర్తి కవితా వైభవాన్ని వ్రాసి పాఠకుల గుండెల చెరసాలలో కుందుర్తి జీవితాంతం ఖైదీగా ఉండటానికి కారణాలేవో వివరిస్తూ చక్కని కేసు తయారు చేశారు. అంతేకాదు తీర్పు చెప్పిన సాహిత్య న్యాయమూర్తిలాగా వ్యవహరించారు. పాశ్చాత్య సాహిత్య మర్యాదలు బాగా అవగాహనం చేసుకున్న రాంమోహనరావుగారు ఈ వాఖ్యాగ్రంథానికి చక్కని న్యాయం చేశారు. దాన్ని ప్రకటించి యువభారతి వారు వచన కవితా ప్రక్రియను ప్రత్యేకంగా గౌరవించారు.

కుందుర్తి 'ఫ్రీవర్స్ ఫ్రంట్' సాహిత్య చరిత్రలో ఆయన సాగించిన ఉద్యమానికి ఒక అక్షరోదాహరణం. ఆయన వచన కవిత మా ఆధునిక కవితా ప్రస్థానంలో సామాన్యుని కంకితమైన భాషా కుటీరం. వచన కవిత్వం వ్రాసే మనుమణ్ణి ఎత్తుకొనే మనుగడ సాధించిన తాత శ్రీ కుందుర్తి!

రౌద్రి ఉగాది
17-3-1980

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
ప్రధాన సంపాదకులు.
యువభారతి ప్రచురణలు

# 'కుందుర్తి' కవితావైభవం

## 1

– నేను గీతాన్ని
ఎండిపోయే పంటని బ్రతుకుపొలంలో
సకాల వర్షపాతాన్ని
కుందుర్తి గుండె శిఖరాలనుండి
పరుగులెత్తిన భావ జలపాతాన్ని
ముక్కోటి తెలుగుల మూగగొంతుల సంగీతాన్ని
ఛందస్సు బంధాలకు పక్షవాతాన్ని
పీడకులను నిర్జించకుండా వదలని పెనుభూతాన్ని
రచనల పూలతోటలో ఛందస్సుమొక్కలు నాటను
భావనలో సామాన్యుని జీవితం వలయాలు దాటను –

కుందుర్తి అచ్చమైన ప్రజాకవి. అచ్చమైన ప్రజా కవిత్వానికి ఆధునిక కాలంలో ఏ నిర్వచనాలు ప్రాధాన్యం వహించాయో అవి కుందుర్తి కవితకు సమగ్రంగా సమన్వయిస్తాయి. కుందుర్తి తన కవితారీతుల్ని గూర్చి తన కావ్యాల్లో అనేకచోట్ల వివరిస్తారు. పైపంక్తులు ఆయన దృక్పథంలోని కొన్ని ముఖ్య విషయాల్ని తెలియజేస్తై. ప్రజాకవిత్వం సమాజంలోని చైతన్యాన్ని సరియైన సమయంలో ప్రతిబింబించి పురోగమనానికి సహకరించాలి. అందుకే పొలానికి సకాలంలో కురిసే వర్షంలాంటిది తన కవిత్వం అంటారు. ప్రజాకవిత్వానికి సామాన్యుడు నాయకుడు. ఆతని సమస్యల్ని వర్ణించడం ఆయన కవిత్వమంతటికీ ప్రధానవస్తువు. ప్రజాకవి ప్రస్తుత సమాజంలోని దోపిడికి ఎదురు నిలుస్తాడు. పీడకుల దౌర్జన్యం నశించడం కుందుర్తి ధ్యేయం. కవిత్వానికి ఛందోబంధాల్ని వదిలించి పూర్తి వచన కవితని తీర్చిదిద్దడంలో కుందుర్తికి చారిత్రక ప్రాధాన్యం ఉంది. వచన కవితా పితామహుడు కుందుర్తి.

## 2

ఈ కాలంలో తెలుగులో సమస్త సాహిత్యశాఖల్లో
వ్యావహారికవాదం విజయం పొందింది
ఎదురుగా ఉండి మాట్లాడుకుంటే ఎలా ఉంటుందో భాష
ఆ భావం స్ఫురించేట్టుగా అనాలని నా సంకల్పం -

ప్రాచీన కవుల్లో తిక్కన పద్యాలలో ఎటువంటి భాషకి పట్టం కట్టాలని భావించి అపూర్వవిజయం సాధించాడో, ఆధునిక ప్రజా కవుల్లో వచన కవితలో అటువంటి లక్ష్యాన్ని అనితరసాధ్యంగా సాధించినవాడు కుందుర్తి. అనాటి తిక్కనకి నాటకీయతా, రసస్ఫూర్తి ప్రధాన విషయాలు. ఈనాటి కుందుర్తికి సామాజిక చైతన్యం ప్రధాన ప్రయోజనం. అందువల్ల ప్రజల వ్యవహారంలో ఉన్న భాషనే సర్వాత్మణ వినియోగిస్తాడు. ఈ విషయంలో ప్రజల భాషనే లక్ష్యంగా వాదించే అభ్యుదయ కవులందరిలో అత్యంత విజయాన్ని సాధించిన కవి కుందుర్తియే.

## 3

ఒక్కొక్క కిరణం వచ్చి చీకటిగుండెల్లో గుచ్చుకుంటున్నట్లు
ఒక్కొక్క చరణంలోని విసురు వందచోట్ల తగిలేటట్లు
వచనగేయం రాస్తుంటే నేను
ఉచితంగా ఫోంచేసి లేచి
పెరుగెయ్యలేదని పోట్లాడినట్లు
పెండ్లినాటి అలక డబ్బు అందలేదని
కార్యం వాయిదా వేసుకున్నట్లు
గణాలు లేనివి గుణాలు కాదని గర్జిస్తారు మీరు.

వచన కవిత్వం కుందుర్తికి ఒక తపస్సు. వచన కవితని వ్యాప్తి చెయ్యడం, దాన్ని వ్యతిరేకించే వాళ్ళకి తగిన సమాధానాలు చెప్పడం, ఆయన కవితా చైతన్యంలో ఒక భాగం. ప్రజలకి ఎట్లా చెప్తే తన కవితా ప్రయోజనం పూర్తిగా నెరవేరుతుందో ఆయనకి బాగా తెలుసు. ఆయన ఉపమానాల్ని ఆకాశపు కొసల్నించి తీసుకురాడు. ప్రజల అనుభవంలో ఉన్న విషయాల్ని, తీసుకుని, వారి వ్యవహారంలో ఉన్న నుడికారంతోనే చెప్పి, గుండెమీద ముద్ర వేస్తాడు. పై రెండు ఉపమానాలూ, కేవలం దోషాల్ని మాత్రం పట్టించుకునే

ఛాందసుల్ని వెక్కిరించడానికి తీసుకోబడ్డె. మొదటి ఉపమానంలో ముఖ్యమైన ప్రయోజనాన్ని పొంది, అముఖ్యమైన విషయంకోసం పోట్లాడడం చెప్పబడింది. రెండో ఉపమానంలో చిన్న విషయంకోసం పెద్ద విషయాన్ని వదిలెయ్యడం చెప్పబడింది. కొందరు వచన కవిత్వాన్ని అనుభూతిలోకి తెచ్చుకునికూడా, ఛందస్సులేదు కాబట్టి దాన్ని గొప్పకవిత్వం కాదంటారు. కొందరు ఛందస్సుమీద ఉన్న మమకారంచేత, వచన కవిత్వాన్ని అనుభూతిలోకి తెచ్చుకోడానికే వ్యతిరేకిస్తారు. ఈ రెండు రకాల వాళ్ళనీ హేళన చెయ్యడంలో తన గడుసుదనాన్ని పై రెండుదాహరణల్లో ప్రదర్శించారు కుందుర్తి.

# 4

సమీక్షకులు నానా చివాట్లు పెట్టినా
రసజ్ఞుల ప్రశంసల వానలు జోరుగా కొట్టినా
దూషణ భూషణ తిరస్కారాలకు దూరంగా ఉండగలవారు
ఆత్మవిశ్వాసపు కండగలవారు
కొందరున్నారు లోకంలో : అందులో నేనొకణ్ణి
ఉద్యోగం హఠాత్తుగా ఊడినా
ఏపూట కాపూట పిల్లలు మాడినా
కట్టుకున్న భార్యకు పుట్టెడు జ్వరమైనా
చంటివాణ్ణి సాయంత్రమే కింద పెట్టారన్నా
భయపడి దణ్ణంపెట్టని; భగవంతుడికి ముడుపుకట్టని
పరమ నాస్తిక శిఖామణులు కొందరున్నారు లోకంలో
అందులో నేనొకణ్ణి.

కవిత్వానికి వ్యక్తిత్వం పూలదండలో దారంలా ఉండాలి. అంతేకాని పూల చాటున దాక్కునే ముళ్ళలా ఉండకూడదు. కుందుర్తి వ్యక్తిత్వం స్థిరమైనది. జీవితాన్ని గూర్చి నిశ్చల నిశ్చిత అభిప్రాయాలు ఆయనవి. స్వభావానికీ నినాదానికీ, అంతరానికీ అంతర్వాణికీ మధ్య అనంత దూరం గల అనేక అభ్యుదయవాదులవలె కాకుండా ఆయన వ్యక్తిత్వంలో ఒక సమగ్రత ఉంది. అందుకే ఆయన కవిత్వంగూడా వైరుధ్యాల నిలయం కాకుండా, బాహిరమైన ప్రయోజనాలచేత సిద్ధాంతాల మార్పు పొందకుండా స్థిరమైన

భావాల పునాది కలిగి ఉంటుంది. తన వ్యక్తిత్వంలోని స్థైర్యాన్నికూడా చాలా చోట్ల సూచిస్తారు కుందుర్తి. అభ్యుదయ వాదులు జీవితం మీద భగవంతుని ప్రభావాన్ని ఏ మాత్రమూ అంగీకరించరు. భౌతిక వాదులై యుంటారు. తన భౌతిక వాద లక్షణాల్ని ఈ పంక్తుల్లో కుందుర్తి చాలా బలంగా చెప్పారు. ఇంత సూటిగా చెప్పగల ధైర్యం చాలా కొద్ది మందికి మాత్రమే ఉంటుంది. వ్యక్తిత్వానికీ కవిత్వానికీ ఒక సమలయని సాధించిన కొద్దిమందిలో కుందుర్తి ఒకరు.

# 5

తను తప్పుచేస్తూ శివశివా అని
నా కండ్లుమూసేయోగి, నీకు వాడు మహాభక్తుడు
నేను వాణ్ణి సహించను -
తిండిలేనివాళ్ళకు తృప్తివిషం పెట్టడానికి
ఒకపూట ఉపవాసం చేసే భోగి
నీకు వాడు మహాఆప్తుడు, నేను వాణ్ణి సహించను-
పావలా కొబ్బరికాయ మొదలు
పదివీశెల బంగారందాకా
ప్రతిదానికీ మెచ్చి భక్తులకు వరాలు యిచ్చి
నీవు దైవపదవిని నిరుపయోగపరుస్తావు
ప్రతిఫల మాశించకుండా, ప్రజలకు ధర్మబోధలు చేసి
పనిముగిసిన మరుక్షణమే
మనుష్య పదవినుండి దిగిపోతాను నేను !

ఈ పంక్తులు కవి భగవంతుణ్ణి సంబోధిస్తూ రాసినవి. 'భగవంతునికి బహిరంగ లేఖ' అనే ఒక సుదీర్ఘ వచన గీతాన్ని కుందుర్తి రాశారు. భగవంతుడి పేర జరిగే అక్రమాలూ అన్యాయాలూ ఈ రచనలో గొప్ప వ్యంగ్య శక్తితో దర్శనమిస్తై. భౌతిక వాదియైన కుందుర్తి దేవుణ్ణి సంబోధిస్తూ రాయడంలో ఒక రహస్యముంది. ప్రజాకవియైన కుందుర్తి ప్రజల్లో ప్రబలంగా ఉన్న విశ్వాసాల్నీ నుడికారాల్నీ వాటికి పాతవాసన ఉన్నంత మాత్రాన ద్వేషించడంగాని, తిరస్క-రించడంగాని చెయ్యడు. భావాల ప్రచారానికీ, కవితా శిల్పంలోని శక్తికీ వాటిని

వినియోగించుకుంటాడు. నీవూ-నేనూ, అనే ధోరణిలో భగవంతుణ్ణి తక్కువ గుణాలుగలవాడుగానూ, మానవుణ్ణి ఉత్తమ గుణాలు గలవాడుగానూ నిరూపించడంలో ఈ కావ్యానికి గొప్ప నాటకీయత సిద్ధించింది. కావ్యం చివర 'అయినా ఎక్కడా లేనివాడికి, ఆలకింపు లేనివాడికి ఎందుకీ కాగితాల ఖరాబు' అనడంలో ఆయన అభిప్రాయం స్పష్టమౌతుంది. సాంప్రదాయికమైన Images ని శిల్ప పరంగా వినియోగించుకున్న అభ్యుదయ కవులలో కుందుర్తి విశిష్టుడు.

# 6

దారిపొడుగునా గ్రామగ్రామాన ప్రజల జయజయధ్వానాలతో
గాంధీజీ కాలినడక సాగించాడు
రెండు వందల ఏండ్ల దుష్పరిపాలనను
పాదాలతో తొక్కడానికి కాబోలు
రెండు వందల మైళ్ళ దూరం నడక సాగించాడు గాంధీజీ
దుష్పరిపాలనైనా సహిస్తాడేమో, దుష్పరపాలన దూరంచేయాలని
గాంధీజీ కాలినడక సాగించాడు -
ఒక్కడుగు వేశాడు - నేల కంపించింది
ఒక్కడుగు వేశాడు - నింగితొంగిచూసింది
ఒక్కడుగు వేశాడు - నేలానింగీ కలిసినట్లు
ఐకమత్యం దేశంలో అల్లుకు పోయింది
మూడడుగుల యీ త్రివిక్రమశక్తికి
బలికాక తప్ప దిక ప్రభుత్వం
తల వంచక తప్పదిక ప్రభుత్వం
ఈ నేల మీద నిలవదింక ప్రభుత్వం
పాతాళమార్గాలు పట్టక తప్పదిక ప్రభుత్వం -

కుందుర్తి 'దండియాత్ర' అనే పేర గాంధీజీ ఉప్పు సత్యాగ్రహాన్ని కథా కావ్యంగా రచించారు. అందులో గాంధీజీ ఉద్యమోత్తేజాన్ని ఈ పైపంక్తులు ప్రతిబింబిస్తే. మార్క్సిస్టు పోరాటాల్లో ముఖ్యమైన నిజాం వ్యతిరేక తెలంగాణా ఉద్యమాన్ని, 'తెలంగాణా' అనే కథా కావ్యంగా రాసిన కుందుర్తి, గాంధీజీ ఉద్యమాన్ని గూర్చి రాయడంలో వైరుధ్యం ఉందని కొందరు భావించారు. కాని, కవి దృక్పథం మరో కోణంలో అర్థం చేసుకోవాలి. ప్రజలలోనుండి సమష్టి

చైతన్యంగా రగుల్కొన్న ప్రతి ఉద్యమమూ, పీడకులకి వ్యతిరేకంగా పీడితులలో చెలరేగిన ప్రతి సంఘర్షణా, దోపిడిదారుమీది కసితో దోచుకోబడ్డవాడు లేవదీసిన ప్రతి విప్లవమూ కుందుర్తిలో ఉత్తేజన కలిగిస్తుంది. ప్రజా చైతన్యం కుందుర్తి కవిత్వానికి జీవనాడి.

వచన కవితలో శైలిమీదా శిల్పంమీదా కుందుర్తికి ప్రత్యేకమైన దృష్టి ఉంది. ఛందో బంధాలనుండి భాషాభేషజాల్నుండి బయటపడ్డ వచన కవిత, వాడుక భాషలో సూటిగా భావాన్ని చెప్పేసి ఊరుకుంటే తేలిపోయే ప్రమాదం ఉంది. అందుకే దానికి శిల్పశక్తి ఉండాలి. ప్రాచీన కవిత్వంలో ఉన్న శిల్పరీతుల్ని బాగా అవగాహన చేసుకున్నవాడు కుందుర్తి. ఆ శిల్పరీతుల్లో, భావోత్తేజనకి ఉపయోగపడే వాటిని. వచన కవితలో సరళ విధానంలో ప్రయోగించి ఒప్పించడం కవి లక్ష్యం. అంటే ప్రాచీన శిల్ప రీతుల్ని ప్రజాపరం చెయ్యడంలో కుందుర్తికి ప్రత్యేక దృష్టి ఉంది. పై పంక్తుల్లో 'గాంధీజీ కాలి నడక సాగించాడు' 'నడక సాగించాడు గాంధీజీ' 'గాంధీజీ కాలినడక సాగించాడు' అనే పంక్తుల్ని మధ్య మధ్య పునరుక్తం చెయ్యడంలో, గాంధీజీ నడకకి ఒక ప్రత్యేకతని కలిగించి, అక్కడి భావానికి దీప్తినిస్తోంది. తర్వాత 'ఒక్కడుగు వేశాడు' అనే వాక్యాన్ని మూడుసార్లు చెప్పి, ఒక్కొక్క దాని పక్కనా ఒక్కొక్క క్రియని వర్ణించడం, అడుగులోని బలానికి విశ్వరూపాన్నిస్తోంది. 'బలి' కాక తప్పదు-అనడంలో బలి చక్రవర్తీ, నాశనం కావడం రెండూ స్ఫురిస్తున్నై. తలవంచక తప్పదు-అనడంలో బలిచక్రవర్తి తలను వంచిన సంఘటనా, ప్రభుత్వం అవమానం పొందడమూ కలిసి ఉన్నై. నేలమీదనిలవదు - అనడంలో బలిచక్రవర్తి భూమి మీద నిలవకపోవడం, ఆంగ్ల ప్రభుత్వం ఈ భారత భూమిని వదలిపెట్టి పోవడం రెండర్థాలూ ఉన్నై. పాతాళ మార్గాలు పట్టడం-లో బలిచక్రవర్తి పాతాళానికి పోవడమూ, తెల్లదొరలు అధోగతికి పోవడమూ అనే అర్థాలున్నై. ఈ అర్థాల్ని పూర్వ కావ్యాల్లో మాదిరి తల బద్దలు కొట్టుకుని ఆలోచించనక్కరలేదు. వెంటనే మనస్సుకి అందుతై. అట్లాగే చివరి నాలుగు పాదాల చివరా ప్రభుత్వం-అనే పదాన్ని పునరుక్తంచేసి ప్రభుత్వం పొందనున్న అధోగతిని తీవ్రంగా చెప్పిన స్ఫురణ కలిగించారు. ఈ పైనున్న శిల్పరీతులన్నీ ప్రాచీన పద్య కావ్యాల్లో చాలా తరుచుగా కనిపిస్తై. ఇట్లాంటి ఎన్నో శిల్పాల్ని వచన కవితలో ఒదిగించి, క్లిష్టతని తొలగించి, ప్రజా సామా

న్యాయానికి అందుబాటులోకి తేవడం కుందుర్తి ప్రత్యేకత. పురాణాల్లోని బలిచక్రవర్తి కథని కూడా ఈ సందర్భంలో శిల్పపరంగా వినియోగించుకున్నారు.

# 7

రా తమ్ముడూ, పోదాం, మనకు చోటు లేదిక్కడ
ఆ పుల్లేని అరణ్యంలో హాయిగా కాలం గడుపుదాం
కడుపుకొరకు క్రూరజంతువునని గర్జించి చెప్పే సింహం
మనిషికంటె నయం కదూ! అమ్మో భయమేస్తుందిక్కడ
రా తమ్ముడూ, పోదాం. ప్రమాదాల పల్లకీ నెక్కి
ఎదురొచ్చే ఎడారిదాటి, ఏరుదాటి వెళిపోదాం
ఇసుక తుఫాను లేస్తుందని హెచ్చరించే ఒంటరి ఒంటె
మనిషికంటే నయంకదూ! అమ్మో భయమేస్తుందిక్కడ.
రా తమ్ముడూ, పోదాం, పడవ బయలుదేరబోతోంది
అవతలి గట్టు చేరేదాకా ఎవర్నీ ఏమనొద్దు మనం
అలల తాకిడికి తట్టుకోమని ఘోషించి పలికే అబ్ధి
మనిషికంటేనయంకదూ! అమ్మో భయమేస్తుందిక్కడ.

సమకాలీన మానవునిలో ఉన్న కుళ్ళునీ కపటాన్నీ బహిర్గతం చెయ్యడం అభ్యుదయ కవితా ధోరణుల్లో ఒక ప్రధాన రేఖ. మనిషిని విమర్శించడానికి అనేక విధానాలవలంబిస్తారు కవులు. ఈ సమాజంకంటె అరణ్యంలో బతకడం నయం, ఈ మనుషులమధ్య కంటె ఎడారి మధ్య బతకడం నయం, ఈ సంఘంలో కంటె సముద్రంమీద ఉండడం నయం. ఎందుకంటే అరణ్యంలో సింహంగాని, ఎడారిలో ఒంటె గాని, అలలతో కూడిన సముద్రంగాని ముందే రానున్న ప్రమాదాన్ని గూర్చి హెచ్చరిస్తై. కాని, దుర్మార్గుడైన మనిషి కాటువేసేదాకా వానపాములాగానే నమ్మిస్తాడు. ఇటువంటి మనుషులకంటె అరణ్యాలు, ఎడారులు, సముద్రాలు నయం, అక్కడికే వెళ్ళిపోదాం మనుషుల్ని ఒదిలి - అని చెప్పడాన్ని పలాయన వాదంగా అర్థం చేసుకోనక్కరలేదు. నిరాశావాదమని త్రోసివెయ్యనక్కరలేదు. మనిషిలోని కపట స్వభావాన్ని అతిశయోక్తి రూపంగా చెప్పే ఒక ప్రౌఢ రీతిగా అర్థం చేసుకోవాలి. మనిషిలోని అమానుషత్వాన్నీ, సమాజంలోని అరాచకత్వాన్నీ సూక్ష్మ విశ్లేషణతో, కవితారూపంగా

చెప్పదలచుకున్న కవిలో, భావావిష్కరణ విధానాల్లో అనంత వైవిధ్యం కనిపిస్తుంది. నినాద ప్రధానమైన కవులధోరణి వేరుగా ఉంటుంది.

పైనున్న పంక్తులు సమలయగల మూడు ప్రత్యేక భాగాలుగా విభజింపబడినై. ప్రతి ప్రత్యేక భాగంలోని నాలుగు పంక్తుల్లో కూడ లయ ఉంది. మూడు ప్రత్యేక భాగాల భావం నడిచిన తీరులోలయ ఉంది. ఒక్కొక్క భాగం యొక్క ఎత్తుగడ, చివరి పంక్తులు ఒకేవిధంగా ఉన్నై. ఇవన్నీ భావలయని సాధించడానికి మార్గాలు. కుందుర్తి కాలానికి వచన కవితకి ఈనాడున్నంత విస్తృత ప్రచారమూ, సర్వజన అంగీకారమూ లేదు. అప్పుడే పద్యాల నుండీ పాటల నుండీ వేరై తన స్వతంత్ర స్వరూపాన్ని వెదుక్కుంటోంది వచన కవిత. అటువంటి పరిస్థితుల్లో వచన గీతాన్ని పరిపుష్టం చెయ్యాలన్న చారిత్రక బాధ్యతని బాగా స్వీకరించిన ప్రముఖుల్లో కుందుర్తి ఒకరు. అందువల్ల ప్రజలకి పూర్తిగా వచనమనిపించే పద్ధతిలో ఉంటే యిది కవిత్వమే కాదంటారనే ఒక సంకోచం వారికి ఉంది. అందువల్ల ఆ తరం వచనకవితా ప్రారంభకులందరూ, ఏదో ఒక విధమైన లయని వచన కవితలో నిరూపించడానికి ప్రయత్నించారు. పద్యాలవలె కనిపించే లక్షణాలకీ, భావాన్ని లయబద్ధమైన వాక్యాల్లో నడిపించే విధానానికీ ప్రాధాన్యమిస్తూ, వచనకవితా పంక్తుల్ని కూడా కొన్ని ప్రత్యేక భాగాల సమూహాలుగా విరిచే విధానానికీ, యింకా కొన్ని రీతులకి ప్రాధాన్యమిచ్చారు. ఈ విధానాల అనంత వైవిధ్యం మీద ఒక విశిష్టదృష్టితో కృషి చేసిన లక్షణం కుందుర్తి కవితల్లో కనిపిస్తుంది. అందులోనూ అతి సులభమైన భాషని లక్ష్యంగా పెట్టుకున్న కవికి, వచన కవితలో ఒక ఉదాత్తత సృష్టించడానికి ఎన్నో పోకడలు పోవడం, లయలని సాధించడం, అత్యవసరమనిపించడంలో ఆశ్చర్యం లేదు.

## 8

సిగిరెట్ పీకెలు ఆర్పకుండా జీవితం గుడిసె మీద పడేసి
కాలం చక్కా వెళ్ళిపోతుంది ! వాలం లేని కోతిలాగా
బాధలతో మత్తెక్కిన మనిషి పది మందినీ కరుస్తాడు
వనమంతా పాడు చేసి ప్రతి పూలచెట్టు విరుస్తాడు
కాలుతున్న ఇంటిమీద కడివెడు నీళ్ళు చల్లకుండా

మొసలి కన్నీళ్ళు చల్లే వాళ్ళే ముందుగా బాగుపడతారు
ఇదీ ఇక్కడి తంతు : ఎవర్ని ఏమనేటట్లు ?

పద్యాన్ని వదిలేసి వచనగేయాన్ని స్వీకరించిన కవికి లయకోసం ఉపకరించే సాధనాలు యతి, ప్రాస, అంత్యప్రాస. వచనకవితా ప్రారంభకు లందరిలో ఈ లక్షణాలు కనిపిస్తై. కుందుర్తి కూడా వీటి స్పృహని ప్రతి పాదంలోను ప్రదర్శిస్తారు. అందులోనూ ఈయన ప్రతి పాదంలోనూ ఎక్కడో ఒకచోట విధిగా యతిని ప్రయోగిస్తారు. ఆ యతిని గూడా కొంతమందిలా మొదటి అక్షరాన్నే మళ్ళీ ప్రయోగించకుండా, పద్యచ్ఛందస్సులోని యతి మైత్రిలాటిదాన్ని పాటిస్తారు. ప్రాసయతిని కూడా కొన్ని స్వీకరిస్తారు. తరచుగా అంత్యప్రాసలు ప్రయోగిస్తారు. ఇంత సామగ్రిని ఆయన సింపినా, పాఠకుడికి, కావాలని కవి వీటిని ప్రయోగించినట్లు ఎక్కడా అనిపించదు. దానికి కారణం యతిగా మొదటి అక్షరాన్నే వాడకపోవడమూ; ప్రతి రెండు పాదాలకీ విధిగా అంత్యప్రాస వాడకుండా భావానికి దీప్తికలిగేచోట మాత్రమే ప్రయోగించడమూ. ఉదాహరణకి పైపంక్తుల్లో రెండు పాదాల్లో మాత్రం ఉన్న అంత్య ప్రాస, మనిషి వికృతచేష్టల వర్ణనకి బలాన్ని ఆపాదిస్తుంది. అన్ని పాదాల్లోనూ ఎక్కడో ఒక చోట యతి మైత్రి ఉంది, సి-జీ, బా-ప, వ-ప్ర, కా-క, మొ-ముం, ఇ-ఎ; యిట్లా ఉంది. ఒక్క రెండో పాదంలో ప్రాసయతి ఉంది. పైగా పాదాల నిడివిలో కూడా ఒక సమత్వాన్ని కుందుర్తి ఎక్కువగా పాటించి లయని సమకూరుస్తారు. లయకోసం యింత ప్రయత్నం గర్భితంగా ఉన్నా, పాఠకుడు భావంలో లీనం కావడానికి ఇవేమీ అవరోధం కావు. పైగా ఎంత బాగా యతి, ప్రాసలు కలిపాడు కవి, అనే స్పృహ ఎక్కడోగాని కుందుర్తిలో కలగదు. కుందుర్తి కవితలో చాలాభాగం ఈ పైలక్షణాల Frame లోకి ఒదుగుతుంది.

# 9

నడిబజారులో పడిపోయిన మూర్ఛవాడు
బిందెలతో దాహం తాగినట్లు
పగుళ్ళువారి నోరు తెరుచుకున్న భూదేవికి
పల్లెల్లో పది దుక్కులైనా లెక్కుండదు.
పల్లెసీమలో వానల మేనాలమీద
దివి నుండి సస్య సమృద్ధి దించేవర్షాకాంత

అవసరం లేనప్పు డడిగితే అప్పులు సులువుగా లభించినట్లు
అక్కరలేని నగరంలో కూడా పుష్కలంగా కురుస్తుంది.

ఋతువర్ణన కవులకు త్రికాలా బాధితమైన కవితా వస్తువు. పద్య కవులు గేయకవులు అసంఖ్యాకంగా ఋతువర్ణన చేశారు. వచన కవితలో అల్పసంఖ్యాకమైన ఋతువర్ణన కావ్యాల్లో కుందుర్తి 'నగరంలో వాన' అతి విశిష్టమైన రచన. సూక్ష్మ పరిశీలన శక్తి, తెలుగు నుడికారం, అలంకార నిర్మాణంలోని ప్రతిభ, భావనలోని సౌకుమార్యం, ఈ 'నగరంలో వాన'లో ఇంద్రధనుస్సులా వెలుగులు విరజిమ్ముతై. సాంప్రదాయికమైన కవితారీతుల్ని ప్రజాపరంచేసి రంజింపజేసే శిల్పం యీ కావ్యంలో ఉదాత్తస్థాయిలో ఉంది. నడిబజారులో పడిపోయిన మూర్ఛవాడు బిందెలతో దాహం తాగడం అతి సాధారణంగా కనిపించే దృశ్యం. నీటిని కోరడంలోని తీవ్రతని యీ ఉపమానం బాగా ధ్వనింపజేస్తుంది. సస్య సమృద్ధిని వర్షం కలిగించడాన్ని, వానల మేనాలమీద వర్షాకాంత సస్య సమృద్ధిని దించడంగా ఉత్ప్రేక్షిస్తున్నారు కుందుర్తి. వర్షాన్ని స్త్రీతో పోల్చినప్పుడు వానల్ని 'మేనాలు'గా చెప్పడంలో ఔచిత్యాన్ని పాటించారు. అవసరం లేనప్పుడు అప్పులు సులువుగా లభించడం, ప్రతి మధ్యతరగతివాడికీ అనుభవసిద్ధమే ! యీ నిజాన్ని చాలా సులభమైన శ్లేషతో మేళవించి, అటు మనిషికీ, ఇటు వర్షానికీ అన్వయింపజేస్తారు కవి. 'అప్పులు' అంటే బాకీలు, నీళ్లుకూడా. అట్లాగే నగరంలో 'పుష్కలంగా' కురవడంలో మేఘం పేరుకూడా ధ్వనిస్తోందనుకోవచ్చు.

# 10

వారాంతపు సెలవుల చట్టం ఉల్లంఘించిన కిరాణా వర్తకుడు
సగం తెరిచిపెట్టిన తలుపు పూర్తిగా మూసేసుకున్నాడు
సిమెంటు గొడుగు చిల్లిగవ్వకు కొరగాక
మామూలు ఎగేసి తనకే నామాలుపెట్టిన అంగట్లో
తలదాచుకున్నాడు ట్రాఫిక్ పోలీసు-
సరిగ్గా పావలా దూరాన్ని 'సవారూపాయికి' పెంచమంటూ
వర్షాధిదేవతకు రిక్షావాండ్లు
వరాలు కోరుకుంటున్నారు-
సైకిలుకి కట్టిన బిందెమీద

గుడ్డమూత పూర్తిగా తీసేసి
వణుక్కుంటూ పాలవాడు వరండాలో నుంచున్నాడు.

ఋతువర్ణనలోని వాస్తవికత సౌందర్యాన్ని మాత్రమే ప్రదర్శించాలన్నది సాధారణంగా సాంప్రదాయికమైన దృక్పథం. సౌందర్యమూ, భావనాశక్తి కవిత్వంలో వాటికవి స్వచ్ఛంగా నిలవటంమీద నమ్మకంలేదు కుందుర్తికి. దేన్ని వర్ణించినా, ఆ వర్ణనలో సమాజవాస్తవికత తప్పనిసరిగా ప్రధానం కావాలన్నది ఆయన వాదం. వర్ణనలో సౌందర్యాదులుండవచ్చు. కాని అవి వాస్తవికతలో నుండి రావాలితప్ప కేవల ఊహాశక్తిలోనుండి రాకూడదన్నది ఆయన మతం. ఏ అనుకూల పరిస్థితి దొరికినా దాన్ని వెంటనే ఆర్థికమైన దోపిడికి వినియోగించుకోడం యీ కాలంలో సామాన్య లక్షణం. సెలవు చట్టాన్ని ఉల్లంఘించిన కిరాణావర్తకుడు, మామూళ్లు తీసుకునే పోలీసు, పాలల్లో నీళ్ళుకలిపే పాలవాడూ పైన వర్ణింపబడ్డారు. రిక్షావాడు దూరానికి ధర పెంచమని వర్షాధిదేవతని వేడుకుంటున్నాడనడంలో అతనిమీది సానుభూతి కనిపిస్తోంది.

## 11

భూమ్మీద పస్తులున్న మనుషుల్ని చూసి
ఆకాశం కంటతడి పెట్టినట్లు
వాన ముమ్మరంగా కురుస్తుంటే-

ఉపమానాన్ని స్వీకరించడంలోనే సమాజవాస్తవికతని ధ్వనింపజేయడం పైరీతిగా ఉంటుంది. క్షుధార్తులైన మానవులు, అశ్రుధారలు కురియడం-లాంటి గంభీరమైన పదప్రయోగం కుందుర్తి సామాన్యంగా చెయ్యడు. తెలుగు నుడికారం ఆయన శైలికి జీవం. తన భావం ప్రజలకి పట్టడం ఆయనకి ముఖ్యం. గంభీరశైలి అనబడే దానిమీద ఆయనకి ప్రత్యేకాభిమానంలేదు. ఈ కారణంచేతనే ఒక్కొక్క చోట కవిత, వచనంలాటి స్థాయిలో నడిచినా, అది ప్రయోజనాత్మకం కావడమే ఆయనకి తృప్తినిస్తుంది.

## 12

-సాయంత్రం పుషికారుకై మూడు గంటలు ముస్తాబై
దవనం బేరమాడుతూనుంచున్న జవరాలు జడలో ముడిచిన

గులాబీపూవులోబడి రేకలమీదప్రాకుతూ
వర్షాంతంలో భూమికి దిగిన ఒకానొక ముసలి జలబిందువు
కులికింది కోటిజన్మాల కోరిక నెరవేరినట్లు;
అందాక దానితో కలిసేవచ్చి అరంగుళం పక్కగాపడి
భూగర్భపు మురికి కూపంలోకి పోయిందొక జలబిందువు
ఎత్తయిన విద్యుద్దీపం మీదికి ఎక్కి నిక్కి చూసిందొక చినుకు
చెట్టుకింద చీకట్లో పడి దారీ తెన్నూ తెలీక
చిందులుత్రొక్కిందొక చినుకు-

జవరాలు జడలో ముడిచిన గులాబిపూవులో పడిన ముసలి జలబిందువు, 'రేకలమీద ప్రాకటం'లో ఉంది మానవ చేష్టారోపణ. అలవోకగా వేసిన ఈ వర్ణనలో ఆధునిక సమాజ ధ్వనికూడా ఉంది. ఆధునిక సమాజమంతా అసమానతల నిలయం. సౌందర్యానికి అరంగుళం ప్రక్కనే జుగుప్స తాండవం చేస్తుంది. మేడమీద విద్యుద్దీపకాంతిలో మెరసిపోయేవాడి ప్రక్కనే, చెట్టుకింద చీకట్లో మరొకడు అలమటిస్తూ ఉంటాడు. ఒక బిందువు 'ఎక్కి నిక్కి చూడడం' ఒక బిందువు 'దారీ తెన్నూ తెలీక చిందులు త్రొక్కడం' – మానవుల చేష్టల్ని స్ఫురింపజేసే నుడికారాలు.

## 13

కొండకు వస్తానని మొక్కుకోని
రాకుండే నీకు కోపమంట
మరి రాలేనితనం మాకు కల్పించింది
నీవు కాక మరెవ్వరా అని దీర్ఘంగా ఆలోచిస్తాను.
జవాబు నా మనస్సుకు దొరకదు
చెప్పే నాథుడూ లేడు
అందరూ ఒక గుడ్డి నమ్మకంతో ఆ దారినే పోతున్నారు
ఆడవాళ్ళది మరీగోల, అది వింటే నీకే నవ్వొస్తుంది
ఒంటిమీదకి వచ్చి నువ్వు కావలసినవన్నీ కోర్తావట!

అభ్యుదయ కవిత్వానికి మూఢ విశ్వాసఖండనం జీవనాడి. ఇలా ఖండించడంలో అధునిక కవుల్లో ప్రధానంగా రెండు మార్గాలున్నై. ఒకరు తీవ్రమైన కోపంతో, కసితో చెప్పి పాఠకుడి భావాన్ని ఉత్తేజింపజెయ్యడానికి ప్రయత్నిస్తారు. మరొకరు వక్రోక్తితో, పరిహాస దృష్టితో చెప్పి, పాఠకుల హేతువుకి

నచ్చేటట్లు చెప్పడానికి ప్రయత్నిస్తారు. కుందుర్తి ఈ రెండోకోవకి చెందినవారు. ఏడు కొండల వాడి పేర జరిగే అన్యాయాల్ని వ్యంగ్యోక్తి రూపంగా వర్ణించే 'భగవంతునికి బహిరంగ లేఖ'లోవి పై పంక్తులు. కొండకి వస్తానని మొక్కుకుని వెళ్ళకపోతే పాపం అంటారు. కాని, వెళ్ళకపోవడం, డబ్బులేక వెళ్ళలేకపోవడం వల్లనే జరుగుతుంది. ఆ దరిద్రాన్ని మనకిచ్చింది కూడా భగవంతుడే అని ఆస్తికుల అభిప్రాయం. వారి అభిప్రాయంతోనే వారి నమ్మకం ఖండించడం ఇక్కడి గడుసుదనం. పాఠకుడు ఈ విధానంవల్ల Convince కావడం సులభమని కుందుర్తి భావం. పూనకం రావడాన్ని 'ఒంటి మీదకి రావడం' అంటారు. ఈ నుడికారాన్ని తీసుకుని గుండెపగిలే వ్యంగ్యాన్నీ, పరిహాసాన్నీ సృష్టిస్తారు కవి. 'ఆడవాళ్ళ ఒంటి మీదికి వచ్చి కావలసినవన్నీ కోరడం'- ఏ మగవాడూ అంగీకరించలేని విషయం. ఇటు వంటి వ్యంగ్యోక్తి చాతుర్యం కుందుర్తి కవితకి ప్రాణరేఖ.

# 14

వాచ్యార్థం వంటి భూతకాలం వెనకాల
దాక్కున్న ధ్వని వంటి వర్తమాన వాహనం మీద
పరనిర్వృతిప్రాయమైన
భవిష్యత్తుకు నా పయనం

ఒక వాక్యంలో పదాల అన్వయం మీద ఆధారపడి వెంటనే స్ఫురించే భావం వాచ్యార్థం. అందులో దాగి ఉన్న అంతరార్థం, ఆలోచనమీద అవగాహనకు వచ్చేది, ధ్వని. వాచ్యార్థంమీద ఆధారపడి ఉన్నదే ధ్వని. కాని వాచ్యార్థం కంటె మనోహరమైనది. అందుకే భూతకాలం వాచ్యార్థం లాంటిది. అందులో నించి వికసించే వర్తమానం, భూతకాలంలోని కలలు నిజమైన రూపం. ఈ నిజమైన కలల నిండైన అనుభూతి మాత్రం భవిష్యత్తులోనే లభ్యమౌతుంది. అందుకే అది పరనిర్వృతిప్రాయమైంది. అభ్యుదయ కవుల నిఘా ఎప్పుడూ భవిష్యత్తుమీదే. భూత భవిష్యద్వర్తమానాలకుగల అవినాభావ సంబంధాన్నీ, అందులోనూ తనకు రేపుమీదగల ఆశనూ, కొద్ది మాటల్లో రమ్యంగా ధ్వనింపజేశారు కుందుర్తి. ఇందులో ఆయన అలంకార శాస్త్రంలోని (భూత కాలం) విషయానికి, వర్తమాన (వచన కవితా) దుస్తులు తొడిగి, భవిష్య దానందానికి అక్షర ప్రయాణం చెయ్యడం గమనించదగింది.

# 15

—యన్జీవోను సూర్యుడని
ఎందుకన్నాడబ్బా ఆరుద్ర పూర్వం ?
తెగని సమస్యల సహస్రబాహువులను
జగతిమీదికి చాస్తాడని కాబోలు
ఎన్నడూ తీరని ఏడుగుర్రాల రథంమీద
ధరలనే చుక్కలమధ్య
దళారి వర్తకులనే గ్రహాలమధ్య
విషాద పరివేషంతో విహరిస్తాడని కాబోలు-

ఎన్జీవోని ఆరుద్ర సూర్యుడితో పోల్చిన పోలికని తన కవితావస్తువుగా స్వీకరించి, కుందుర్తి సూర్యుడికీ ఎన్జీవోకీ చెప్పిన పోలికలు చమత్కారమైనవి. అందులోనూ ఎన్జీవో విషాద సమస్యామయ జీవితానికీ తేజోమయుడైన సూర్యుడికీ సామ్యాలు చెప్పడం చిత్రంగానే ఉంటుంది. సూర్యుడు వెయ్యి చేతులతో జగంమీద పడతాడు; ఎన్జీవో తెల్లవారగానే వెయ్యి సమస్యలతో లోకం మీద పడతాడు. వాడి రథానికి ఏడు గుర్రాలు; ఈ మధ్య తరగతివాడికి కోరికలే గుర్రాలు. వాడు తారాగ్రహాల మధ్య తిరుగుతాడు; వీడికి ధరలే చుక్కలు, వర్తకులే (దుష్ట)గ్రహాలు! వాడు జలరాసులనుండి అప్పులు (నీళ్లు) లాక్కుంటాడు; వీడు 'ధనరాసులు' కలవారినుండి అప్పులు (నిజంగా అప్పులు!) మొదటి పరిచయంలోనే పరిగ్రహిస్తాడు. వాడు సాయంత్రానికి తేజస్సు కోల్పోయి, పడమటి సముద్రంలో 'క్రుంకు'తాడు; వీడు పగలల్లా పనిచేసి సాయంత్రానికి సగానికి సగమై సంసారంలోపడి 'కునుకు'తాడు. వాడు రాసులమధ్య తిరుగుతుంటే శీతోష్ణ పరిస్థితులు మారుతూ ఉంటై; వీడి జీవితంగూడా సాఫీగా ఉండకుండా ఎప్పటికప్పుడు విషమ జీవితం గడుపుతూ ఉంటాడు. 'ఎన్జీవో' కవిత శ్రీ కుందుర్తి ఉపమానిర్మాణ చాతుర్యానికి ఒక మచ్చు తునక.

# 16

-ఇంతకూ ప్రూఫులు దిద్దడానికి
ఇంకా ఆ ముసలి బ్రహ్మదేనా స్వామీ !

ఎప్పుడూ దిక్కులు చూడ్డమేసరి
పనిచేసే మొగమేనా అది !
ఆయనకు ఛందస్సూ, వ్యాకరణమూ ఉంటేచాలు
వ్యంగ్యమూ, అర్థమూ, ఔచిత్యమూ ఎందుకు ?
కాలం అనేమాట
(మా ప్రాణాలకు కాబోలు)
గాలంగా అచ్చుపడ్డది
మానవత్వం మావనత్వం అయింది
మనుషులంటే అడివిమృగాలనే వ్యంగ్యం
మనసులో పెట్టుకుని రాయలేదుగదా !
సోషలిజమ్ ఎక్కడ చూసినా
మెలిక 'శం'తో అచ్చేశారు
నిరుపేదల నిత్యయధార్థజీవితం
స్ఫురింపజేయడానికి కాదుగదా !

సమకాలీన సమాజంలోని అక్రమాల్ని అనౌచిత్యాల్ని ధ్వనింపజెయ్యడానికి కవి అనేక కవితా రీతులు ఎన్నుకుంటారు. ఈ కవితలో ఒక చమత్కారమైన భావన. కవి, సృష్టి అనే కావ్యాన్ని చదివారు. కాని, ఆ కావ్యంనిండా అచ్చు తప్పులు. దానికి కారణమేమిటంటే ప్రూఫులు దిద్దేవాడు ముసలి బ్రాహ్మడు (బ్రహ్మ). అది పని చేసే మొహం కాదు; ఎప్పుడూ దిక్కులు చూడ్డమే పని ! నాలుగు దిక్కులకీ నాలుగు మొహాలు బ్రహ్మకి ఉన్న విషయాన్ని ధ్వనింపజేస్తూ తెలుగునుడికారంతో మరో అర్థాన్ని స్ఫురింపచెయ్యడం కవి చమత్కృతి. ఆ ముసలి బ్రాహ్మడికి ఛందస్సూ, వ్యాకరణమూ కావాలి; అర్థమూ, ఔచిత్యమూ అక్కరలేదు. అంటే సమాజాన్ని నడపవలసిన పెద్దలు ఛాందసులై, సమకాలీనమైన భావాల మార్పునీ, కాలానుగుణమైన విశేషాల్ని గమనించక, ప్రాచీన సంప్రదాయాలవైపు నడిపించే ప్రయత్నంలో ఉన్నారన్నది వ్యంగ్యం. కాలం ప్రాణాలకి గాలంగా, సమస్యాత్మకంగా ఉంది. మానవత్వం మావనత్వమై మృగదశకి పోతోంది. సోషలిజం రావలసింది, ప్రజలకి 'శోష' వస్తోంది. ఈ శోష నిరుపేదల నిత్య జీవితం. చమత్కారంతో కూడిన వ్యంగ్యం కుందుర్తి కవితలో ప్రధానమైన అంశం. అట్టిరీతి ప్రజల మనస్సుని బాగా ఆకట్టుకుంటుందని ఆయన భావం.

# 17

శ్రీశ్రీని పిలుద్దామనుకుంటే
అభ్యుదయపు నిషాలో వచ్చి
నా మాట పూర్తిగా మరచిపోయి
మాస్కో విశ్వవిద్యాలయం గురించి
మాట్లాడతాడేమోనని భయం-
మనసులోకూడా అనుకోకూడదు
మా గురువుగారి మాట
తిక్కపుడితే తిట్టిపోతాడు
కవినీ కావ్యవస్తువునూ
నిండు సభనీ, నిర్వాహకుల్ని
జాషువాకవిని పిలుద్దామంటే
ఆయన ఎప్పుడూ పరధ్యానంగా
'హనుమంతరావూ' అంటాడు నన్ను
ఉన్న కాస్త పేరూ ఈ రూపేణా పోతుందని
ఒకటే బెదురు నాకు లోపల !

లలితమైన హాస్యరసానికి కుందుర్తి వచన కవిత పెట్టింది పేరు. అందు లోనూ, వచన అన్వయక్రమాన్ని పాటించే వచన కవిత కాబట్టి ఆ హాస్యం వెంటనే పాఠకుడి గుండెకు తాకుతుంది. కవి తన 'నాలోని నాదాలు' అనే కవితా సంపుటిని ఎవరికి అంకితమివ్వాలా అని ఆలోచిస్తున్నారు. ఈ సందర్భంలో సమ కాలీనులైన మహాకవుల్ని తీసుకొని, లోకంలో సుపరిచితమైన వారి ప్రత్యేక లక్ష ణాల్ని చెప్పడం చాలా నవ్వు పుట్టించే విషయం. శ్రీశ్రీకి అభ్యుదయమే ఒక 'నిషా'. 'మాగురువుగారు' అంటే విశ్వనాథ సత్యనారాయణగారు. కుందుర్తికి విశ్వనాథ కవితాప్రతిభమీద మహాగౌరవం. ఆయన ప్రాచీనతా దృష్టిమీద పరమ వ్యతిరేకత. విశ్వనాథ షష్టిపూర్తి సందర్భంగూర్చి రాస్తూ, 'మీ శైలి కాస్త కటువైంది, అయినా, ఆంధ్రజాతి ఆలోచించి మోయక తప్పింది కాదు. ప్రతిభ స్వయం ప్రకాశం, దానికి సిఫార్సులు అక్కర్లేదు' అంటూనే 'అతి సామాన్యుడి సాహచర్యం అంతగా మీ భావనకు లభించలేదుగాని, అలా జరిగి

ఉన్నట్లైతే... "అని బాధ పడతారు. విశ్వనాథ, సభల్లో ఏ సమయంలో ఎవర్ని తిడతాడో చెప్పడం కష్టమన్నది లోకప్రసిద్ధం. జాషువా 'ఆంజనేయులు' అనే మాటకి సమానార్థకంగా 'హనుమంతరావు' అని పరధ్యానంగా పిలవటంచేత కవిపేరే మారిపోతుంది. ఇట్లా మిగిలిన కొందరు కవుల్నిగూర్చిగూడా చెప్పి, చివరికి 'ఎవరికి కృతి యిశ్వాను మరి ఈ కావ్యం?' అని ప్రశ్నవేసుకుని, ఒక్క పొల్లుమార్పుతో' 'ఎవరికీ కృతి యివ్వను మరి యీ కావ్యం' అని సమాధానం చెప్తారు. వచన కవితలో ఇలాంటి హాస్యరీతుల్ని పరిపుష్టం చెయ్యడం కుందుర్తి ప్రత్యేకతలలో ఒకటిగా కనిపిస్తుంది.

# 18

మన వంశీకుడు పురూరవుడు
మందుకూ్కడా కనిపించడు
ఊర్వశి పాపం ఎక్కడో ఉరివేసుకుని ఉంటుంది
హృదయేశ్వరి కనిపించడంలేదు
అభ్యుదయకవులు అరెస్టు చేస్తారని !
వత్సలాఫాలం మీద నెలవంక గుర్తులోంచి
స్వేదబిందువులు కాలువలుకట్టాయి
ఆకలినోట్లో పెట్టుకుని పుట్టిన గర్భదరిద్రుడు
అందరినీ వెనక్కు నెట్టాడు -
కావాలని పాత్రలకు కల్పించిన విరహంతో
ముందూవెనకా తెలియక చంద్రుణ్ణి తిట్టించారు నాడు
ఎక్కడో ఎవడో చస్తే ఆవేశం తెచ్చుకొని
పాలకులను సాధిద్దామని, కవితను గేలిపట్టిస్తున్నారు నేడు
అందుకే విరహంలో కూడా
కసిదీరా కవులమీద పట్టించాను
ఇకమీద మనగోడు, ఎవరూ రాయకపోతే
మనమే రాసుకుందాం !
మాకోసం మాకవిత్వమని మనం కూడా ప్రకటిద్దాం
ఆకాశం నుండి దిగకుండా అక్కడే కూచుందాం !

ఆత్మాశ్రయమైన భావ కవిత్వానికి విరుద్ధంగా సమాజాశ్రయమైన అభ్యుదయ కవిత్వం ఒక మహోద్యమ రూపాన్ని ధరించింది. భావకవిత్వంలో చాలా ముఖ్యమైందీ, ప్రజల్ని ఆకర్షించిందీ వియోగ కవిత్వం. భావకవితోద్యమాన్ని వ్యతిరేకించిన ఆధునిక కవులందరూ ఆ భావాల్ని తమ కవితల్లో విమర్శించారు, దూషించారు, వెక్కిరించారు, వేళాకోళం చేశారు. ఇలా వేళాకోళం చెయ్యడంలో ఒక ప్రౌఢమైన మార్గంలో నడిచింది కుందుర్తి రాసిన 'ప్రేమలేఖ' ప్రియుడు ప్రేయసికి ప్రేమలేఖ రాస్తున్నాడు. ఆలేఖలో అభ్యుదయ కవిత్వాన్ని నిందిస్తాడు ప్రేమ గొప్పతనాన్ని చాటుతాడు. ప్రేమగొప్పతనాన్ని చాటడంలోనే, దాన్ని కించపరచే వక్రోక్తిఅభ్యుదయ కవిత్వాన్ని తేలికపరచేమాటల్లోనే దాని గొప్ప తనాన్ని చెప్పే వ్యంగ్యమూ' ఈకవితలో అతి లలిత ధోరణిలో ప్రదర్శిస్తారు కుందుర్తి. ఊర్వశి,హృదయేశ్వరి,గిరికుమారుడు,వత్సల,-వీరంతా భావ కవులలో అగ్రేసరులు సృష్టించిన పాత్రలు. వియోగభావానికి నిరంతర సంకేతాలుగా నిలిచే వ్యక్తులు. కృష్ణశాస్త్రి, శివశంకరశాస్త్రి, విశ్వనాథ, నాయని హృదయాల్లోంచి ఊడిపడిన విరహమూర్తులు. ప్రేమలేఖ రాస్తున్న ప్రేమికుడు వారిపై సానుభూతి చూపిస్తున్నట్లు రాస్తూ, వారిని గేలి చేస్తున్నాడు కవి. ఊర్వశి ఉరిపోసుకోవడం, హృదయేశ్వరి కనిపించకపోవడం, వత్సల స్వేదబిందువులు రాల్చడం, ప్రేమ కవితా పరాజయాన్ని సూచిస్తాయి. అభ్యుదయ కవులు అరెస్టుచేస్తారని గిరికుమారుడు కొండగుహలో దాక్కోవడం, అభ్యుదయోద్యమ తీవ్రతని వ్యక్తంచేస్తుంది. 'గర్భదరిద్రుడు' వీరందర్నీ వెనక్కునెట్టాడు ప్రేమికుడి దృష్టికి ఇది నిందా వాచకం. కాని, అభ్యుదయోద్యమానికి గర్భదరిద్రుడే నాయకుడయ్యాడన్నది నిజమైన విషయం. ఎక్కడో ఎవడో ఎందుకో చస్తే ఆవేశం తెచ్చుకుని పాలకులను సాదిద్దామని కవితను గేలిపట్టిస్తున్నారు ఈ కవులు అనడం,అభ్యుదయ వ్యతిరేకులు చెప్పేమాటల్ని ప్రేమికుడినోట అనిపిస్తూ, ప్రేమికుడు లాటి విలువలేని మనిషి విమర్శించడం చేత, ఆ మాటలకి విలువలేదని చెప్పే గడుసరి ధోరణి. ఈ ప్రేమికుడు, ఎవరూ తమ గోడు పట్టించుకోకపోతే తానే రాసుకుంటాడు! అభ్యుదయ కవులు సమాజం కోసం మా కవిత అంటే, తాను తమ కోసమే తమ కవిత అని ప్రకటిస్తాడు! భావకవిత్వపు ఆత్మాశ్రయతత్వాన్ని పరిహాసం చేసే రీతి యిది. ''ఆకాశం నించి దిగకుండా అక్కడే కూచుందాం'' - అనడంలో 'దిగిరాను దిగిరాను దివినుండి భువికి'అనే భావకవి అభిప్రాయాన్ని గేలిచెయ్యడం

ఉంది. క్షుందు_ర్తి పరిహాస ధోరణి యింత సుకుమారంగా, ఇంత సూక్ష్మంగా, ఇంత ప్రౌఢంగా ఉంటుంది.

# 19

కాలం ఆగిపోయింది
క్షణంలో ఒక వందోవంతు
అనాదిగా అనంతంగా కదిలే కాలప్రవాహం
హఠాత్తుగా నడిమికి తెగింది
ఆనాడు ఆగిపోయింది
క్షణంలో ఒక వందో వంతు ...
ఆ పగులు ఒక గుర్తు
చరిత్రలో ముగిసిన ఒక అధ్యాయానికి
రసవత్తరజీవన కావ్యంలో ముగిసిన ఒక అధ్యాయానికి
గీతలో భగవానుడు చేసిన యుగే యుగే వాగ్దానానికి
అస్తమించాడు సూర్యుడు
చీకటి స్వైరవిహారం చేసింది
అనంతకోటి నక్షత్రాల కండ్లలో కారిన కన్నీటి బొట్లతో
ఆకాశం బావురుమన్నది
పృథ్వీమాత పుత్రశోకంతో
గుండెలు గ్రుద్దుకున్నది
వీధిలో జన సందోహంతో
ఊపిరి సలపక ఉక్కిరి బిక్కిరై
కదల్లేక స్తంభించింది గాలి
చాచిన నాల్కలమీద చల్లదనమావహించి
అల్లల్లాడిం దగ్ని
వేసవికి నీరింకి పోతున్నట్లు
జలధి గుండె జల్లుమంది
... ... ... ...
ఇదంతా ఒక గుర్తు
భారత సూర్యుని అస్తమయానికి

పల్లెటూరి పొలాల్లో ఎగిరే పక్షులు
చీకటిని చూచి చిందులు త్రొక్కినై
నగరంలో ఫ్యాక్టరీ మరచక్రాలు ఆ క్షణం ఆగిపోయాయి
జీవితం స్తంభించిపోయింది
టెలిఫోను తీగలద్వారా లోకంలో శోకం ప్రవహించింది
... ... ... ...

నెహ్రూ మరణించినప్పుడు, చాలా మంది కవులు ఎలెజీలు రాశారు. కుందుర్తి ఎలెజీలో శోకంతో పొందిన తాదాత్మ్యత ప్రతి అక్షరంలో పలుకుతుంది. ఈ కవిత అంతా ఒక మహాశోకావేశానికి అక్షర అగ్ని ప్రవాహరూపం. కవిత ప్రారంభంలో 'కాలం ఆగిపోయిం'దనడమే కవి పొందిన దుఃఖం యొక్క పతాక స్థాయితో ప్రారంభమయింది. తర్వాత శైలి అంతా ఒక విసురుకీ, ఒక ప్రవాహ రూపమైన భావోద్విగ్నతకీ నిదర్శనంగా సాగి, శోకతీవ్రతకి పదాల నడక ప్రతిబింబంగా కనిపిస్తుంది. అన్ని దేశాల్లో కాలం ఆగిపోవడం, నెహ్రూ అంతర్జాతీయ వ్యక్తిత్వ విస్తృతిని తెలియజేస్తుంది. అనుభూతి తీవ్రదశల్ని వ్యక్తం చెయ్యదలచిన ఏ కవైనా ప్రకృతి వర్ణనని ఆశ్రయించక తప్పదు.సాధారణంగా, సామాజిక వాస్తవికతలో నిమగ్నమయ్యే కుందుర్తి ఈ గేయంలో పంచభూతాత్మకమైన ప్రకృతికి తన భావనాశక్తిని జోడించి, శోకం రూపుగట్టడంలో కృతార్థుడైనాడు. నక్షత్రాల కళ్ళలో కారే కన్నీళ్ళతో ఆకాశం బావురుమనడం, నేలతల్లి గుండెలు గుద్దుకోవడం, గాలికి ఊపిరి సలపకపోవడం, అగ్ని చల్లబడి అల్లల్లాడ్డం, సముద్రం గుండె జల్లుమనడం, ఇవన్నీ భావనావధికమైన దుఃఖప్రతీకలు. 'టెలిఫోను తీగలద్వారా లోకంలో శోకం ప్రవహించడం',మరణ వార్త క్షణాలమీద ప్రపంచమంతా వ్యాపించడాన్నీ, దానితోపాటు శోకం నిండిపోవడాన్నీ, పాఠకుడి కళ్ళముందు నిలిపే దృశ్య చిత్రీకరణ. ఇట్లా అగ్ని జలపాతంలా సాగిన ఈ గేయం చివరికి వచ్చేటప్పటికి, 'నెహ్రూ మరణించాడో, నేనే మరణించానో' అని కవియనడం, ఆయన తాదాత్మ్యానికి పరాకాష్ఠయై, పఠితభావాన్ని స్తంభింపజేస్తుంది. సాధారణంగా, ఆవేశపరత్వాన్నీ, అనుభూతి గాఢత్వాన్నీ, ఆత్మాశ్రయ విధానాన్నీ ఆశ్రయించని కుందుర్తి ఈ కవితలో అన్నిటినీ మేళవించుకుని ప్రత్యక్షరంలో జ్వలించాడు. అందుకే యిది గొప్ప ఎలెజీలలో ఒకటయింది.

# 20

మీకు తెలుసు
గని గర్భాలు పేలుస్తాను, కారడవులు కాలుస్తాను
నదుల మార్గం మలుస్తాను, సముద్రం తొలుస్తాను
మేఘాన్ని కవ్విస్తాను, పొలాల్ని నవ్విస్తాను
వెలుగు చెప్పింది చేస్తాను, చీకటిని దాచేస్తాను
ఇవిగో నా విలువలు
చెడిపోయిన శాస్త్రం విలువలు
మీకు స్వాధీనం చేస్తున్నాను
ప్రభుత్వాన్ని వదలి ప్రజలను ఆశ్రయిస్తున్నాను
నన్ను వాడుకోండి
హాయిగా పాటలు పాడుకోండి
జీవితం విలువలు కాపాడుకోండి-

అణుశక్తి ఆధునిక కాలంలో అనంత విజయాలు సాధించింది. కాని ఆ విజయాలన్నీ నాశన కార్యాలకే ఉపయోగపడడం అనుభవసిద్ధం. గని గర్భాలు పేల్చి, కారడవులు కాల్చి, చీకటిని దాచి, వెలుగు చెప్పిన పనిచేసే అణుశక్తి యిలా వినియోగింపబడ్డానికి కారణం ఏమిటి ? మానవతా సంబంధమైన విలువల్ని గుర్చిన దృకృథం దీనికి హేతువు అనడం సామాన్యమైన విషయం. కాని అభ్యుదయ భావనకలవాని దృష్టిలో, ఏది ప్రభుత్వం చేతిలో ఉంటుందో అది అధికారంకోసం దుర్వినియోగమవుతుంది. ఏది ప్రజల చేతిలో ఉంటుందో అది ప్రజాసామాన్య క్షేమంకోసం వినియోగింపబడుతుంది. శాస్త్రం విలువలు ప్రభుత్వాధీనమైతే చెడిపోతై. ప్రజాధీనమైతే బాగుపడతై. అప్పుడే శాస్త్ర విజ్ఞానం సార్థకమై జీవితపు విలువలు కాపాడి హాయిగా పాటలు పాడుకునేట్టు చేస్తుంది. అణుశక్తియేకాదు, ఏ శాస్త్రవిజ్ఞానమైన ప్రభుత్వాధీనమై తన ప్రజా క్షేమ దృష్టినే పోగొట్టుకుంటుంది. ప్రభుత్వానికీ, ప్రజలకీ ఉన్న ఈ వైరుధ్యం అభ్యుదయ కవికి ప్రధాన విషయం. అదే కుందుర్తి 'అణువు చెప్పింది' అనే గేయంలో నిరూపిస్తున్నారు. 'ప్రభుత్వాన్నివదిలి ప్రజల్ని ఆశ్రయిస్తున్నాను' అనడంలో ఈ రహస్యమంతా దాగిఉంది.

# 21

ఈగ దూరను సందులేదు
ఇది అడివి
భూలోకమంతా కలిసి జానెడు నిడివి
నాలోకి నేను వెడతాను
జీవితం అన్వయం కుదరదు
అంతా అచ్చు తప్పు
అందం అకారం లేని పూలు ముడువని కొప్పు
ఊహల దండలు కడతాను
ఆత్మలోనే ఆనందం ఉంది
అది విపంచి
తాకితే పలికే ధ్వనులు తలచి తలపంకించి
నాలోని నాదాలకు ఉలికి పడతాను

ఈగ దూరే సందులేని అడివి ఊహాలతో క్రిక్కిరిసిన మానవుడి మనస్సే. మనస్సు ఉంది కాబట్టి ఆ మనస్సుకి ఈ ప్రపంచం ఉంది. మనస్సు యొక్క విస్తృతిలో మమైక్యమైనప్పుడు మనిషికి ఈ భూలోకమంతా జానెడుగా కనిపించ డంలో ఆశ్చర్యం లేదు. అటువంటప్పుడు కవి తనలోకి తాను వెళ్తాడు. అన్వయం కుదరని అపశ్రుతిమయమైన జీవితాన్ని మరిచిపోయి కాసేపు ఊహల దండలు కడతాడు. ఆత్మలో ఉన్న ఆనందాన్ని త్రవ్వుకుంటాడు. ఆనంద స్వరూపమైన అత్మనాదాలకు పులకిస్తూ ఉంటాడు. ఇవన్నీ ఆత్మాశ్రయమైన భావాలు. సమాజమే తన కవితలో కథా వస్తువుగా, సామాన్యుడే నాయకుడుగా, అభ్యుదయ భావాలే పునాదిగా ప్రజాకవిత్వం రాసే కుందుర్తి 'నాలోని నాదాలు' పేర ఆత్మాశ్రయమైన భావాల్ని చాలా గేయాల్లో చెప్పారు. ఈ కావ్యంలోనే గాక ఆయన తన అనారోగ్యం మీద, మృత్యు భయం మీద, తన సమస్యలమీద, సన్మానాల మీద చెప్పిన కవితలు అసంఖ్యాకంగా ఉన్నై. ప్రజాకవి ఈ భావాల్ని చెప్పడంలో వైరుధ్యం ఉందా అన్న ప్రశ్న. సమాజాన్ని గూర్చి ఎంతగానో పట్టించుకుని నిమగ్నులైన మహాకవులు, మనస్సు లోతులకి సంబం ంచి, తమ జీవితానికి సంబంధించి, ఆత్మాశ్రయమైన కవితల్ని చెప్పడం

అసామాన్యం కాదు. జీవితంలో కవితాస్పందన ప్రధానమైన వ్యక్తి తన మనో భావాల్ని గూడా రాసుకోవడం సహజం. ఎందరో కవుల్లో ఇది కనిపిస్తుంది. శ్రీశ్రీలో, మయకోవిస్కీలో, పాబ్లోనెరూడాలో - అసంఖ్యాకులైన ప్రజా కవుల్లో ఇది సర్వసామాన్యం. కుందుర్తి కూడా కవితాస్పందన జీవితంలో ప్రధానమైన అంశంగా భావించినవాడు.

కాని కవిత్వం ఒకటి వుంది
కదలనియ్యదు మెదలనియ్యదు
మెత్తగా చేస్తుంది మెదడును
జాలి ఒత్తితో మండిస్తుంది గుండెను

కవిత్వం యొక్క ప్రభావం తన మనస్సుమీద ఉండటం కవితా చైతన్యం జీవితంలో ముఖ్యమైన కవిలోనే సంభవించే విషయం.

# 22

తరణి కిరణ సంపర్కాన గర్భం
తాల్చిన ఏ జలదాంగన కడుపో పండి
ఊడిపడిన ఒక జల బిందువు
ఉదధికి చేరేవరకు
గడిచే కాలానికి
ఒక జీవితమని పేరు
అదే మనకు ప్రమాణం యాతనలు కొలవడానికి
వదలిపెట్టి వచ్చిన దేవుణ్ణి మళ్ళీ కలవడానికి
అదిలో ఒక కొండమీద
అటూ ఇటూ గిలగిలా తన్నుకుంటూ
ఎలుగెత్తి ఏడ్చింది జలబిందువు
ఒక పిల్ల కొండకాల్వ ఒడిలో చేరి
బాలారిష్టాలు దాటి పరుగెత్తడం నేర్చుకుంది
ఉడుకులెత్తే యౌవనంలాంటి
సెలయేటి ఘర్ఘుగలు మరిగి

జలపాత మార్గాల దూకులు పెట్టి
నేల మీద వచ్చి నీటుగా ప్రాలింది
సమతలంగా ఉంటుందని ఊహించింది భూమి
ఎక్కడ చూచినా మిట్టపల్లాలు
అడవులూ, కొండలూ, నదులూ, ఎడారులూ
అన్నీ తన శక్తికీ యుక్తికీ అంతులేని పరీక్షలై
తప్పించుకుని వచ్చి వచ్చి
ఇప్పుడు సముద్రానికి చేరువగా ఉంది.

అంతర్ముఖమైన ఆత్మాశ్రయత్వం ఒక్కొక్కచోట వేదాంతానికి కూడా దారి తీస్తుంది. కుందుర్తి దేవుణ్ణి, సాంప్రదాయిక సంకేతాల్ని చాలావరకు కవితాత్మక సంకేతాలుగానే వాడుకొన్నా కొన్ని సందర్భాలలో గాఢమైన సాంప్రదాయిక వేదాంతభావనారేఖలు కూడా ఆయన కవిత్వంలో అక్కడక్కడ కనిపిస్తై 'అముద్రితా కావ్యం' అని ఆయన రాసిన కావ్యంలో ఈ ఛాయలు ప్రచురంగా ఉన్నై. పైన ఉదాహరించిన పంక్తులు, జీవితాన్ని గూర్చి సంప్రదాయ వేదాంతం చెప్పే భావన సంకేత రీతిలో ఉంది. సూర్యునివల్ల గర్భం దాల్చిన మబ్బు కడుపులోంచి పడ్డ నీట బొట్టు మానవుడు. ఈ మానవుడు అనే జల బిందువు సముద్రంలో కలిసే దాకా దాని పేరు జీవితం. తానొక జలబిందువు. అట్లాంటి జలబిందువుల సమాహారమైన సముద్రంలో కలిసిపోతాడు. దీన్నే 'వదిలిపెట్టి వచ్చిన దేవుణి మళ్ళీ కలవడానికి' అంటున్నాడు కవి. అంటే తనలోని వస్తువూ, తాను కలవబోయే దేవునిలోని వస్తువూ ఒకటే. ఇది అద్వైతభావన. జలబిందువు కొండమీద పడి ఏడవడమూ, గిలగిలా తన్నుకోవడమూ, కొండకాల్వ ఒడిలో బాలారిష్టాలు దాటి పరుగెత్తడమూ, సెలయేరై ఉరుకులెత్తడమూ, దూకడమూ, నేలమీది మిట్టపల్లాలు పరీక్షలై తప్పించుకు రావడమూ - పసితనం నుంచి పెరగడం, యౌవ్వనం పొందడమూ, తర్వాత సమాజ సమస్యలకి గురి కావడమూ అనే మానవుడి బ్రతుకును ధ్వనింపజేస్తోంది. ఇదంతా తత్వాలరీతిని పుణికి పుచ్చుకొని, సాంకేతికంగా జీవితాన్ని వర్ణించే విధానం. అముద్రిత కావ్యంలో నాయకుడైన కోటేశ్వరరావు ఆలోచనలుగానే వీటిని కవి చెప్పినా, యిట్లాంటివెన్నో పంక్తులు కుందుర్తి మీద మిగిలిపోయిన సంప్రదాయ ప్రభావాన్ని సూచిస్తై.

# 23

శరీరంలో ఎడమ భాగం సగానికి సరిగ్గా కోసి
అందమైన అతివను తెచ్చి
అతికించుకోవాలనిపించింది
పరమశివునిలా పగటా రాత్రీ
సతీస్పర్శ సాగాలనిపించింది
... ... ... ...
వెన్నెల వెక్కిరిస్తున్నది
ఒంటరితనపు బ్రతుకుచూచి
కట్టెడు దూది పెట్టికుట్టిన పరుపు
గ్రుచ్చుకుంటున్నది అంపశయ్యలా
ప్రబంధనాయిక రాత్రివచ్చి
పలకరించింది కలలో
ఉదయమే వచ్చిన పనిమనిషి
ఊర్వశి తోబుట్టువులా ఉంది.
... ... ... ...
గుండె కొక్కానికి తగిలించుకున్నాడు
క్యాలెండరు మీది సినిమానటి బొమ్మతీసి
మనోవిపంచి మీద పాడుకున్నాడు
వేదన భావగీతాలుగా వ్రాసి
... ... ... ...
నేలమీద నడుస్తుంటే
పూలు పరిచినట్లుంది
ఆకసంవైపు కండ్లెత్తితే
అచ్చరలు పిలిచినట్లుంది
... ... ... ...
నెమ్మదిగా మంచి చేసుకుని
ఏ తరంగంమీదనో ఎక్కి
ఆనందజలధికి ఆవలితీరాన

వేచియున్న ప్రేయసి ఒడిలో
వెళ్ళివ్రాలుదా మనిస్తుంది-

కోటేశ్వర్రావుకి యౌవనారంభవేళ. ఆతనిలో తలెత్తిన తీయని బాధని వర్ణిస్తున్నారు కవి. ఒక్కొక్క భావాన్ని ఒక్కొక్క లయబద్ధమైన భాగంగా చెప్తుంటే, పద్యకవి ఒక్కొక్క భావాన్ని ఒక్కొక్క పద్యంగా రాసిన విధానం కనిపిస్తుంది. సుకుమారమైన పదాల్నీ, అందమైన శైలినీ అనుసరించడం. ఆయా సందర్భాల్లో పద్యకవులు అవలంబించే ఔచిత్యాన్ని గుర్తుకు తెస్తున్నై, కుందుర్తి రీతి యిలా ఉంటుంది. గంభీరమైన శిల్పాన్ని ప్రజాపరం చెయ్యాలన్న తపన ఈ శైలికి వెనక ఉంది. శరీరపు ఎడమ భాగంలో స్త్రీని అతికించుకోవాలనే అతిశయోక్తి సంప్రదాయికం. ఉదయమే వచ్చిన పని మనిషి ఊర్వశి చెల్లెలులా ఉండటం నవ్యమైన ఊహ. గుండె కొక్కానికి సినిమానటి బొమ్మ తగిలించుకోడం, గదిలో క్యాలండరు వ్రేలాడదీసే వాస్తవికతని గుండె లోని కోరికకి చమత్కారంగా అన్వయించడం. అలమీద ఎక్కి ఆనంద సముద్రం అవతల ఒడ్డున వేచి ఉన్న ప్రేయసి ఒడిలో వ్రాలడం, అచ్చమైన భావకవి ఊహ. కుందుర్తిలో సంప్రదాయ రీతీ, ఆధునికతా స్ఫూర్తీ యిట్లా పెనవేసుకుని కలిసిపోవడం విశిష్టమైన విషయం.

# 24

జీవితంలో చెలరేగిన అశాంతి
శాంతికి సేతువు
మన ఆదర్శాల శివతాండవమే
సరికొత్త శబ్దాల హేతువు.

అభ్యుదయ కవికి జీవితంలోని అశాంతి, అపస్వరమూ కవితావస్తువు, సంఘర్షణ ఉంటేగాని ఈ అసమ సమాజంలో సమానత్వం స్థాపించ బడదు. అందువల్లనే ఈ సమాజాన్ని బాగుపరచే ఆదర్శాలుకూడా శివతాండవం చెయ్యాలి. శివ తాండవం ఆవేశానికీ, పాత వ్యవస్థని కూల్చి నూతన వ్యవస్థ నిర్మించడానికీ సంకేతం. అటువంటి ఆవేశంలోనుండే కవిలో సరిక్రొత్త శబ్దాలు ఉద్భవిస్తై. పాత వ్యవస్థని కూల్చే ఆవేశం లేకపోతే సాంప్రదాయకమైన పదాలే రాజ్యంచేస్తై. వ్యవస్థలోని మార్పుకీ, నూతనమైన శబ్దాల కూర్పుకీ అవినాభావ

సంబంధం ఉంది. ఈ అర్థమంతటినీ, క్లుప్తంగా నాలుగు చిన్నపంక్తుల్లో కుదించి, లయబద్ధం చేసి, రెండు, నాలుగు పాదాల్లో అంత్యప్రాసలతో దానికొ శక్తినిచ్చి రాశారు కవి - దీన్ని 'మినీ కవిత' అనవచ్చు. ఇటువంటి మినీకవి లెన్నిటినో కుందుర్తి సుదీర్ఘ కవితల్లోంచి విడిగా ఏరుకోవచ్చు. సూక్తుల జీవితసత్యాలు ఇటువంటి రీతిలో చెప్పడం ఆయనలో చాలా చోట్ల క పిస్తుంది.

# 25

పనికిరానిదాన్ని వదిలేసే
బలంలేదు గుండెలో
చైతన్యం పట్టే స్థలం లేదు !
నీ మనసు రైలుపెట్టెలో
దొంగలున్నారు జాగ్రత !
ఆత్మలో లేని ఆనందం
ఎక్కడ వెతికినా దొరకదు
వెలుగులో లేని సౌందర్యం
చీకట్లో అసలు దొరకదు
భయపడిన వాణ్ణిచూచి
వెకిలిగా నవ్వే విశ్వం
భయపడనివాడి బానిస!

సమస్యా సంకీర్ణమైన లోకంతో పోరాడ్డానికి సహజంగా మనిషికి ధైర్య కావాలి. ధైర్యం మాటలవల్లా నినాదాలవల్లా వచ్చేదికాదు. మనసులో వచే మార్పువల్ల మాత్రమే సాధ్యం. సమష్టిగా సామాజిక సంఘర్షణకోసమైనా వ్యక్తిగతంగా జీవన సంఘర్షణకోసమైనా, పిరికివాడు సాధించగలిగిం శూన్యం. చైతన్యానికి విరోధి బలహీనత. ఆ బలహీనత మనసులో ధైర్యాన్ని కొల్లగొట్టే దొంగ. ఆ బలహీనత మనస్సులో ఉంటే మనిషికి, చుట్టూ ప్రమ దావకాశాలే కనిపిస్తై. నిరాశావాదికి ప్రతిచోటా భయమే ఎదురౌతుంది 'భయపడినవాడు' అనే కవితలో కుందుర్తి ఈ మనస్తత్వాన్ని సూక్ష్మంగా వ్యక్తీకరిస్తారు, కింది విధంగా—

# 26

వీధుల్లో పడి తిరుగుతున్నప్పుడు
ఎండలో బ్రతుకు సలసల మరుగుతున్నప్పుడు
మర్రిచెట్టు నీడ
మనసార రమ్మని పిలుస్తుంది
అమ్మో! అక్కడికి వెళితే
హతమై పోతాననిపిస్తుంది!
ఎలక్ట్రిక్ తీగలమీద ఇరుక్కున్న గాలిపటం
అమ్మో ఎంత పొడుగాటి పాము!
గాలికి పడగ ఆడిస్తోంది
దాని బారినుండి తప్పుకోలేము!
ఎదురుగా వస్తున్న మోటారుకారు
ఎందరి గొంతులో కోసినబాకు
ఇప్పుడు డ్రైవరు నిషాలోలేడని
ఏమిటి నమ్మకం నాకు ?

ఇటువంటి 'పనికిరానిదాన్ని వదిలేసేందుకు గుండెలో' బలం కావాలి. ఆ బలం ఆత్మలోనుండే రావాలి. అందుకే ఆత్మలో లేని ఆనందం ఎక్కడ వెతికినా దొరకదు. ఆత్మయే వెలుగు. ఇక్కడ ఆనందమూ, వెలుగూ, సౌందర్యమూ, చైతన్యానికే సంకేతాలు. భయంలేని, నిరాశలేని గుండలోనే ఈ భావాలు వికసిస్తై. భయపడేవాడు, లోకాన్ని చూచి భయపడడం అనవసరం. లోకం భయపడినవాణ్ణి యింకా భయపడేటట్లు నవ్వుతుంది; ధైర్యవంతుడి కాళ్ళు పడుతుంది. ఇదొక శాశ్వత జీవన సత్యం. అభ్యుదయ భావుకుడికి అవసరమైన ఈ సత్యాన్ని కుండ బద్దలు కొట్టినట్లు చెప్తున్నారు కుందుర్తి.

# 27

గతం చూసి గర్వించడం మంచిదే
కాని ప్రస్తుతం పఠించడం మరీ మంచిది
గతం విస్మరించడం తప్పే
కాని పట్టుకు వేలాడ్డం మరీ తప్పు
వాల్మీకి రామాయణం, వ్యాసుడు భారతం రాసినట్లు

వర్తమాన కథావస్తువును వర్ణించడం నా మతం
... ... ... ... ... ...
తెనుగు భారతి పాతరీతులు తేరి అంచులబడిన మంచి
జగతి సర్వ దేశ కవితారీతుల సారాంశములోన చొప్పించి
చేసింది ఈ స్వేచ్ఛాగీతి
నా సమకాలికులకు ఇదంటే ప్రీతి
దీనిలో పెద్ద కావ్యం రాయడం ఒక రకంగా గొప్ప
ఇంతవరకు ఋజువులేదు, నేను రాసిన తెలంగాణా తప్ప.

గతాన్ని కాల్చెయ్యమనే ఉగ్రవాది కాదు కుందుర్తి. కాని గతంకంటె వర్తమానానికి ఎక్కువ విలువ నిస్తారు. గత కాలం స్మరించి గర్వించడానికేగాని, అనుచరించడానికి మాత్రం కవి అంగీకరించడం లేదు. కాలానుగుణమైన మార్పుల్ని మనసారా ఆహ్వానిస్తారు. వాల్మీకి రామాయణం, వ్యాసుడు భారతం రాసిన రీతి కుందుర్తికి నచ్చిన విషయం. వారు తమ కాలంలో జరిగిన కథల్ని రాశారు; అట్లాగే తాను తన కాలంలో జరిగే కథల్ని రాస్తారు. కుందుర్తి తన దైన ప్రత్యేక ప్రతిపాదనగా చెప్పే విషయం, కథా ప్రధానమైన కావ్యాలు ఈనాటి యితివృత్తాలతో రావాలని. కవి యివ్వవలసిన సందేశం కథా ప్రణాళిక వల్ల బాగా ప్రజాదరణకూ, ప్రచారాన్నీ పొందగలదని ఆయన మతం. రామాయణ భారతాలు, సందేశాన్ని కథాత్మకంగా చెప్పినందువల్లనే వాటి ప్రయోజనం సిద్ధించిందని ఆయన అభిప్రాయం. ఇంకా ఆయన ఉద్దేశం, కవితా శిల్పం శిల్పంగా పురాణ యుగంలో ప్రచారం పొందలేదనీ, అటువంటి స్థితి కవిత్వానికి ప్రబంధ యుగంలోనే ప్రాప్తించిందనీ. రామాయణ భారతాలు శిల్పం కంటె సందేశానికే ప్రాధాన్యమిచ్చినవని ఆయన భావం. అటువంటి స్థితి ఆధునిక వచన కవితకి రావాలని ఆయన ఆశయం. కథా కావ్యం అనగానే ప్రాచీన కావ్యాలు ప్రమాణంగా తీసుకోక తప్పదు, అందుకే తెలుగు భారతి పాతరీతుల్లోని మంచినీ, సర్వదేశాల కవితారీతుల సారాంశంలోనికి చొప్పిస్తానంటున్నారు. అంటే వచన కవితాధోరణిలో, ప్రాచీన కథా కావ్యాల శిల్పరీతుల్ని అనుసరిస్తూ, వర్తమాన కథల్ని చెప్తాననడం. అటువంటి పెద్ద కావ్యం తనకు ముందు రాలేదు. తాను తెలంగాణా ఉద్యమం మీద రాసిన 'తెలంగాణా' కథా కావ్యమే ఈ రీతిలో

ుదటిది. కుందుర్తి కథా కావ్యాల్లో ప్రాచీన శిల్పరీతులు అడుగడుగునా దర్శన ిస్తూఉంటై.

# 28

- ఆకాశంలో కొన్ని తెల్లటి మబ్బులు
అంతరిక్షవాసులు ప్రోగువేసుగున్న ఉప్పుకుప్పల్లా ఉన్నాయి
టెర్రరిస్టులగుండెల్లో మండుతున్న మంటలు పైకెగసినట్లు
ఎర్ర ఎర్రని మబ్బులు కొన్ని
గుంపులుగా చేరి గుసగుస లాడుతున్నాయి -

గాంధీజీ చేసిన ఉప్పు సత్యాగ్రహాన్ని, 'దండియాత్ర' పేర ఒక చన కవితా కావ్యంగా రాశారు కుందుర్తి. ఉప్పుచేసే ఉద్యమానికి ప్రజలలో తేజం కలిగించి, సముద్రం దగ్గరకు పోవడానికి నిర్ణయించారు గాంధీజీ. సందర్భంలో ప్రకృతిని వర్ణించిన విధానం పైపంక్తులు. ప్రాచీన కావ్యాల్లో థాగతమైన విషయాల్ని ప్రకృతివర్ణనలో ధ్వనింపజేయడం ఉత్తమ శిల్ప తుల్లో ఒకటి. తెల్లటి మబ్బుల్ని ఉప్పుకుప్పలతో పోల్చడం, ఎర్రటి మబ్బుల్ని ిర్రరిస్టుల గుండెమంటలతో పోల్చడం, ఉప్పుకోసం జరిగే ఉద్యమాన్ని ధ్వనింప స్తై. కథాగమనానికి బలాన్ని కలగజేస్తై.

# 29

ఆయన ఒక రోజు హఠాత్తుగా
చరిత్రకు కబురు పెట్టి పిలిపించాడు
దండికి వెళ్ళేదాకా తనకు తోడుగా ఉండమన్నాడు
దానికి భయం వేసింది
పాశ్చాత్యచరిత్రకారుల పలుకులే
అది వింటుండేది అప్పటిదాకా
వాళ్ళ అపార్థాల పిండివంటలే అది తింటుండేది అప్పటిదాకా
వైస్రాయి భవనంలోకి దూరి ఒక గదిలో తలదాచుకుంది
ప్రజలది కనిపెట్టేవున్నారు
పరుగు పరుగున ఢిల్లీ వెళ్ళారు

వైస్రాయిభవనం తలుపులు బద్దలు కొట్టారు
అప్పటికే భవనం మీద కాకులూ గ్రద్దలూ ఎగురుతున్నాయి
చరిత్రముక్కుకుతాడేసి లాక్కొచ్చారు
తమ నాయకుడి కాళ్ళముందు పడేట్లు
ఒక్క తోపుతోశారు వారందరూ.

దురధికారానికీ, దురన్యాయానికీ, దోపిడికీ, రాపిడికీ వ్యతిరేకంగా ప్రజల్లోంచి అల్లుకునే ఏ ఉద్యమమైనా కుందుర్తికి కవితా వస్తువు. 'దండియాత్ర' కావ్యంలో ప్రాచీన కావ్యాల్లోని అవతారిక లాంటి రీతిలో తన కవితా మార్గాన్ని గూర్చి చెప్తూ, 'స్వేచ్ఛా గీతి నా మార్గం' అని రాశారు. అందులో 'ఈనాడు మన కవిత్వం, వర్తమాన చరిత్రలోని ప్రజోద్యమ చైతన్యానికి పేరు మోసిన ప్రతినిధి-ప్రజల కోసమే రాసేది, వారే కృతి భర్తలు; ప్రజల గురించే రాసేది. వారే భవిష్యన్నిర్మాణ కర్తలు' అంటారు. ప్రజల్లోంచి తెల్లవారికి వ్యతిరేకంగా రేగిన మహోద్యమమే ఆయిన 'దండియాత్రలో' ప్రధాన వస్తువు. ఆ ఉద్యమాన్ని వెలిగించిన మహాత్ముడుగా గాంధీజీని గూర్చి ఎంత చెప్పినా, ఆయన చూపిన బాటలో ప్రజలలో చెలరేగిన ఉద్యమ చైతన్యానికి ప్రాణ ప్రతిష్ఠ చెయ్యడమే కుందుర్తి కేంద్రీకరించిన విషయం. గాంధీజీ సముద్రం దగ్గరికి ప్రజల్ని తీసుకుపోయి. ఉప్పు చేస్తానని ప్రకటించిన సమయం గూర్చి చెప్తున్నాడు కవి. కథను చెప్పడంలో కుందుర్తి చాలా గడుసరి. తనకి కావ్య పరమార్థం ఏదో అది ధ్వనించే లాగా సన్నివేశాల్ని మనముందు నిలుపుతారు. ఉప్పు చేస్తానని గాంధీజీ ప్రకటించిన రోజు చరిత్రాత్మకమైన రోజు ఆ పిలుపుకి ప్రజలందరూ ప్రతిస్పందించడం చరిత్రలో ప్రజలు తెచ్చిన గొప్ప మలుపు. గాంధీ పిలుపు నిమిత్త మాత్రం. చరిత్ర సృష్టించింది ప్రజలు మాత్రమే. ఈ విషయం ధ్వనించడం కుందుర్తికి ప్రధానం. అందుకే గాంధీజీ 'చరిత్రకు కబురు పెట్టి పిలిచాడు, ప్రజలు 'చరిత్రముక్కుకు తాడేసి లాక్కొచ్చారు, తమ నాయకుడి కాళ్ళముందు పడేట్లు ఒక్క తోపు తోశారు.'

# 30

ఇప్పుడు అడివిలో అన్నీ దొరుకుతై
దేనికీ కరువు లేదు

చెట్లు కొట్ల దగ్గర చిలకషావుకార్లు
పండిన పండ్లు చవుకధరల కమ్ముతారు
చెరువులో పరిశుభ్రమైన పాలు
ఎండకుమరిగి ఎల్లికొల్లగా దొరుకుతాయి
కాపలాదార్ల కండ్ల బస్తాలమూతులను
దబ్బనాలతో కుట్టి
ధాన్యం అడివికి పోతుంది
కాఫీపొడి నల్లరంగు గౌన్లు తొడుక్కొని
చీకటి గుర్రాలమీద అడివికి చేరుతుంది
ఇప్పుడు అడివిలో దేనికీ కరువులేదు
మనిషినెత్తిన ఆరుమళ్ళైనా బరువులేదు–

నిజాం నవాబు నిరంకుశ పాలనకి వ్యతిరేకంగా చెలరేగిన ప్రజోద్యమాన్ని 'తెలంగాణా' వచనకవితా కావ్యంగా రాశారు కుందుర్తి. దాన్తోనే వచన కవితా కథాకావ్యానికి మహోత్తమ నాందీ వాక్యం పలికారు.కథా కథన శిల్పంలో ప్రాచీన పద్య మహాకవుల్లాగా,అనంత వైవిధ్యాన్ని ఈ కావ్యంలో ప్రదర్శించారు. కథ చెప్పడంలో సూటిగా చెప్పే విధానం కాకుండా ధ్వని పూర్వకమైన ధోరణిలో ఎన్నో గడుసుపోకడలు పోయారు. నిజాం నవాబు పరిపాలన కూల్చడానికి విప్లవకారుల సంఘాలు ఏర్పడ్డై. వాటికి అడివియే స్థావరం.మొదటినుంచి చివరదాకా కావ్యంలో విప్లవకారుల సమూహాన్ని 'సంఘం' అంటారు కుందుర్తి. ఈ సంఘం ఈ కావ్యంలో నాయకుడు. అతడు 'సంఘం సూర్యుడు'. అడివిలో సంఘానికి దేనికి లోటులేదని చెప్పడంలో పైపంక్తుల్ని రచిచారు కవి. చెట్లమీద ఉన్న చిలుకలు వాళ్ళకి పండిన పండ్లు రాలుస్తున్నై. చెట్లని కొట్లతోనూ, చిలకల్ని షావుకార్లతోనూ రూపకాలంకారంచెయ్యడంలో, వ్యాపారస్థులు అనేక వస్తువుల్ని వాళ్ళకి చౌకధరల్లో, చెట్లదగ్గరికి చేరవెయ్యడమనే ధ్వని వస్తోంది. చెరువులో పాలు దొరకడమంటే, చెరువుమీదుగా చేరవెయ్యబడే వస్తువుల్ని సూచిస్తుంది. కాపలాదార్ల కనుగప్పి ధాన్యాన్ని అడవికి తేవడాన్ని, వాళ్ళ 'కండ్లబస్తాల మూతుల్ని దబ్బనాలతో కుట్టి'అని చెప్పడంవల్ల కాపలాదార్లని చేసిన మోసంలోని నిగూఢత బాగావ్యక్తమౌతుంది. చీకటిలో నల్లరంగు గౌనుతొడుక్కొని తప్పించుకోడమనే విషయాన్ని, కాఫీపొడి రహస్యంగా అడివిలోకి చేరుతుందనే

విషయాన్నీ, ఏకంచేసి చెప్పడం విచిత్రమైన పద్ధతి. అట్లాగే చీకటిని గుర్రాలతో రూపకం చెయ్యడంలో, చీకటిలో వెళ్ళడమూ, గుర్రాలమీద వెళ్ళడమూ రెండర్థాలు సిద్ధించినై. ఇట్లా తెలంగాణా కావ్యం అంతా ఒక ధ్వనిమయమైన మహా కావ్యంగా కనిపిస్తుంది.

## 31

పదహారేండ్ల పసుపుచీర పమిట చెంగుమీద
ప్రశ్నలదారాలు లాగుతున్నాడు పోలీసు అధికారి -
పమిట చెంగు వదలమని కసరి గద్దించే యువతిని
లాలానగా అదిలించే అధికారి
... ... ... ... ......
నీవు నిన్న అడివికి వెళ్ళావని ఋజువు దొరికింది
పోలేదు నేను
వాగు ఒడ్డున జొన్నచేలోకి
నిన్ను పిలిచినవాడెవ్వడు
ఇవ్వాళ రేవుకు పోలేదు నేను -
అధికారి కనుసైగ చేసింది
ఆ యువతి తప్ప ఎవరూ గుర్తించలేదు
పోలీసులు కొట్టడం మొదలెట్టారు
దేహాన్ని తాళ్ళతో కట్టడం మొదలెట్టారు
కర్ఫ్యూ అక్కడికి ఎవరినీ రానియ్యదు
అయినా ఆక్రందనల ఆహ్వానాన్ని
హృదయాలు తోసెయ్యలేవు
కొద్దికొద్దిగా ప్రజలు చేరారు
బొమ్మల్లా నుంచున్నారు —
నీ నెత్తిమీద ఒక బియ్యం మూట
అడివిలోకి చేరింది
ఇంట్లో ఈ పూటకూడా బియ్యంలేవు

దానికి ఋజువు నీ చెదిరిన పాపిట
చిక్కుపడిన ముంగురులు
నూనెలేక తల దువ్వలేదు-
అధికారి కనుసైగ చేసింది
ఆ యువతి కూడా గమనించలేదు
పోలీసులు బూట్లతో మొట్టడం మొదలెట్టారు
కీళ్ళమీద లాటీలతో కొట్టడం మొదలెట్టారు
ఆక్రందనల ఆహ్వానాన్ని తిరస్కరించలేని గుండెలు
ఎన్నో నిద్రనుండి లేచాయి
ప్రజలు పెద్దపెట్టున అక్కడికి చేరారు
బొమ్మల్లా నుంచున్నారు -

విప్లవకారులకోసం గాలిస్తున్నారు పోలీసులు. ఎక్కణ్ణించి కబురువస్తే అక్కడికిపోయి, వారి వార్తను చెప్పమని ప్రజల్ని చిత్రహింసలు చేస్తున్నారు. స్త్రీలని మానభంగం చేస్తున్నారు. విప్లవకారులకి రహస్యంగా సహాయపడే ప్రజలు దేనికైనా తెగించి తమ నాయకుల్ని కాపాడుకుంటున్నారు. ఈ నిజాన్ని తన కవితా శిల్పానంతటినీ ఏకాగ్రంచేసి, హృదయాల్ని రగిలిస్తాడు 'తెలంగాణా'లో కుందుర్తి. పదహారేళ్ళ పసుపు చీర, నూతన వధువుని సూచిస్తుంది. కిరాతకులకి ఏ విధమైన ఆర్ద్రతాలేదు. పమిట చెంగుమీద ప్రశ్నల దారాలు లాగడం అనే రూపకంలో ఆమెని ప్రశ్నలు వెయ్యడమూ, అదే సమయంలో చీర లాగడమూ, అనే రెండు భావాలూ మిశితమైపోయి, ఎంతో భావానికి క్లుప్తతని తెస్తున్నై. పోలీసు క్రౌర్యాన్ని మరింతగా వ్యక్తం చేస్తున్నై. పోలీసు ప్రశ్నలూ, ఆమె సమాధానాలూ, నాటకీయంగా రాశారు కుందుర్తి. ప్రశ్న, సమాధానం - సూటిగా ఉంటై. ఎవరు పలికారో ఊహకి వదిలెయ్యడం. కవి ప్రాధ్యాం భావతీవ్రత మీదనే, పాత్రమీదకాదు. ఇక్కడ రెండు ప్రశ్నలు, రెండు సమాధానాలు, తర్వాత 9 పంక్తుల్లో పోలీసు చేష్టలూ, ప్రజల స్పందనా, తర్వాత మళ్ళీ రెండు ప్రశ్నలూ, రెండు సమాధానాలూ, తర్వాత 8 పంక్తుల్లో పోలీసు చేష్టలూ, ప్రజలస్పందనా వర్ణించబడ్డై. ఇక్కడి పంక్తుల్లోని భావంలోని లయ గమనించదగింది. మొదటి భాగంలో' అధికారి కనుసైగ చేసింది, ఆ యువతి తప్ప ఎవరూ గుర్తించలేదు'. రెండో భాగంలో 'అధికారి కనుసైగ చేసింది

ఆ యువతికూడా గమనించలేదు'. ఈ మధ్య కాలంలో పోలీసు చేసిన దౌర్జన్య క్రియల ప్రభావాన్ని 'యువతి తప్ప ఎవరూ గుర్తించలేదు' - 'యువతి కూడా గమనించలేదు' - అనే వాక్యాల్లోని చిరు భేదంతో అద్భుతంగా ధ్వనింపజేశారు కుందుర్తి. మొదటి భాగంలో పోలీసులు కొట్టడం, తాళ్ళతో కట్టడం; రెండో భాగంలో పోలీసు బూట్లతో మొట్టడం, కీళ్ళమీద లాఠీలతో కొట్టడం - మొదటి భాగంలో ఆక్రందనల ఆహ్వానాన్ని హృదయాలు తోసెయ్యలేవు. అంటే ఆమె అరపులకి జనం వచ్చి మూగారు. రెండో భాగంలో ఆక్రందనల ఆహ్వానాన్ని తిరస్కరించలేని గుండెలు ఎన్నో నిద్రనుండి లేచాయి. అంటే ఎంతోమంది నిద్రపోతున్నవారు కూడా లేనివచ్చారని భావం. మొదటి భాగంలో కొద్దికొద్దిగా ప్రజలు చేరారు. రెండో భాగంలో ప్రజలు పెద్దపెట్టున అక్కడ చేరారు. కాని రెండు భాగాలచివరి వాక్యమూ ఒకటే 'బొమ్మల్లా నుంచున్నారు' స్తంభించిపోయారు. కదిలితే పోలీసులు వారిని కాల్చేస్తారు. రెండు భాగాల్లో సమలయతో ఉన్న రచన చేస్తూ, కొద్ది భేదంతో సన్నివేశం యొక్క పరిణామాన్ని ధ్వనింప జెయ్యడం అద్భుతమైన శిల్పం. ప్రాచీన కావ్యాల్ని మధించి, ప్రజాపరం చేసిన ప్రయోగం. ఈ శిల్పప్రయోగం, శిల్పంగాగాక, సన్నివేశాన్ని తీవ్రంగా అభివ్యక్తి చెయ్యడం, శిల్పం యొక్క అవసరాన్ని గుర్తింప జేస్తుది.

# 32

కాలుతున్న శవంలాగ కరిగే న్యాయాన్ని
కనికరిస్తాను నేను
మహాబోధి వినిపించిన మహాబోధలు
కలవరిస్తాను నేను
కాలిపోయే నిజం గుడిసెలమీద పూర్ణ కుంభంగా
అవతరిస్తాను నేను
కూలిపోయే ఆదర్శగోళాలను రవికాంతితో
ఆవరిస్తాను నేను
నేను మార్పును - మనుషుల మనసులు ఆక్రమిస్తాను
నేటి మీద పరాక్రమిస్తాను.

తెలంగాణా - కావ్యాన్ని కుందుర్తి కొన్ని భావాల పునాదులమీద రాశారు. కాలం, మార్పు, ఉద్యమం, జనశక్తి, సంఘర్షణ — యిత్యాది భావాలు కావ్యంలో అంతః ప్రవాహాలుగా ఉంటై. కథలో పాత్రలూ, సంఘటనలూ మొదలైనవన్నీ అప్రధానమైన అంశాలు. కథ ప్రారంభంలో, అంతంలో, మధ్యలో ఈ భావాల్ని విస్తరించి వర్ణించడం, ఆ భావాల్ని గూర్చి పాఠకులు ఆలోచించే ప్రయోజనాన్ని ఆశించి చెయ్యబడింది. మధ్యలో కొన్ని ముఖ్యమైన భావాలు మళ్ళీ మళ్ళీ చెప్ప బడుతూ ఉంటై.

'క్రమక్రమాగత చైతన్య ధనుష్పాణులు
ప్రజలు నేడు
సమాజ సమిష్టి ప్రయోజన నిశిత బాణులు
ప్రజలు నేడు'

ప్రజల్లో చైతన్యం రావడం, సమాజ ప్రయోజనానికి కృషి చెయ్యడం ఒక అంశం : విప్లవకారులు ధనుస్సుల్నీ బాణాల్నీ ధరించడం ఒక అంశం : ఈ రెంటినీ కలిపి రూపకాలంకారంగా చెప్పడం శిల్పవైచిత్రి. ఈ పాదాలు కావ్యంలోని ప్రధాన భావానికి ఆయువుపట్లు, కావ్యం నిండా ఈ పంక్తులు అక్కడక్కడ పునరుక్తమౌతై. అట్లాగే-

'ఈ నేల ఎవరిది ? కోటి ప్రజల సొత్తుగదా
కొందరు వద్దంటే ఒప్పుకోని చగిత్రా
ముందుకు పదా !'

తెలంగాణా పోరాటం ప్రధానంగా భూపోరాటం. అందుకోసం ఈ పై పంక్తులు గూడా కావ్యంలో అక్కడక్కడ పునరుక్తం కావడమేగాక, యిదే కావ్య పరమార్థమని చెప్పడానికి ఈ పంక్తులే కావ్యాంతంలో రాయబడినై.

ఈ దృష్ట్యా పైన తీసుకున్న పంక్తులు 'మార్పు'ను గూర్చిన భావాలు. కాలంలో మార్పు అనివార్యం ఆ మార్పు ప్రజల చైతన్యం మూలంగా చేసుకుని ప్రజ్వరిల్లుతుంది. 'న్యాయదాన' అనే భాగంలో, ఈ మార్పుయొక్క లక్షణాల్ని విస్తృతంగా వర్ణించారు కుందుర్తి. అదిగూడా 'మార్పు' తనని గూర్చి చెప్పు కుంటున్నట్లు వర్ణించడంలో బలం ఉంది. పై పంక్తుల్ని చూస్తే, పద్యకావ్యా ల్లోని సీసపద్య శిల్పం గుర్తుకు వస్తుంది. కాలుతున్న శవంలాగా కరిగే న్యాయ

మన్న ఉపమలో, న్యాయంయొక్క దైన్య స్థితేగాక, విప్లవకారుల మరణాలు గూడా సూచిత మవుతున్నై. కాలిపోయే నిజం గుడిసె లనడంలో, నిజం యొక్క దారుణ పరిస్థితియేగాక, అధికారులు ప్రజల గుడిసెల్ని తగలబెట్టడం కూడా వ్యంగ్యమౌతుంది. రవికాంతితో ఆవరించడం - తన వెలుగును ప్రసరించ డమేగాక, కావ్యంలో విప్లవ సంఘాన్ని 'సూర్యుడు' అని సంకేతించడంచేత, ఆ విప్లవం జయిస్తుంది అనే ధ్వని ఉంది. నేటిమీద పరాక్రమించడం, సంఘర్షణలో నుండే మార్పు వస్తుందని సూచించడం. ఈ విధమైన అద్భుత శిల్పరీతులెన్నో 'తెలంగాణా'లో దర్శనమిస్తై. ప్రాచీన మహా కవుల్లో అక్కడక్కడా కనబడే ధోరణులూ, నవ్యధోరణులూ సమ్మిళితమై, భావశిల్పాల సమగ్ర సమ్మేళనంగా 'తెలంగాణా' ఆవిర్భవించింది. ఈ ఆత్మ విశ్వాసంతోనే కవి చెప్పుకోగలిగారు-

'బహుశా ఇదే మొదలనుకుంటాను
గేయాలు తెచ్చిన కొత్త తెలుగు
ఆధునిక యుగంలో ఒక పూర్ణ కావ్యంగా
బ్రతుకును వర్ణించడం'

ఇందులో అతిశయోక్తి ఎంతమాత్రమూలేదు. 'తెలంగాణా' ప్రజా ఉద్య మానికి పరమ విశిష్ట రూపాన్నిచ్చిన ధ్వని కావ్యం.

# 33

అననే అంటారు విమర్శకులు: నాకు తెలుసు
రాజకీయాల జోలికి పోయానని రాచిరంపాన పెడతారు
వాళ్ళు రాజకీయాలన్నదాన్ని
వర్తమానమంటున్నాను నేను-
వర్తమానం పురివిప్పి ఆడుతున్న నెమలి
అన్నికండ్లు తెరచుకొని ఆశగా చూస్తుంది నావేపు
ఎవరూ రాయంది ఏదో నేను రాస్తానని
ఎవరూ చెయ్యంది ఏదో నేను సాధిస్తానని
నామీద గంపెడాశతో నడుస్తుంది నేటి చరిత్ర -

కుందుర్తి ఎప్పుడూ వర్తమాన జీవి. వర్తమానకాలంలోని సమస్యలతో సంఘర్షణలతో ఆయన కవిత్వానికి అవినాభావ సంబంధం ఉంటుంది. అందుకే

చాలామంది కవిత్వంలో రాజకీయాల్ని హర్షించలేకపోయినా, కుందుర్తి రాజకీయాల్ని తన కవిత్వాన్ని బాహిరమైన విషయంగా భావించాడు. అట్లాగని రాజకీయ సిద్ధాంతాన్ని స్పష్టంగా చెప్పే కవి కాదు. రాజకీయాలకి మూలమైన సంఘర్షణనీ, ప్రజల తిరుగుబాటునీ, సమసమాజంకోసం జరిగే అన్ని విధాలైన ఉద్యమాల్నీ హర్షిస్తాడు. వర్తమాన కాలంలో ప్రతి విషయమూ రాజకీయంతో ముడిపడి ఉండటంచేత, రాజకీయాన్ని వర్తమానమంటున్నాడు కవి. నేటి కవి బాధ్యతారహితంగా కేవలం కల్పనకోసం జనించినవాడు కాదు. అతనిమీద చరిత్రకు గంపెడాశ. అంటే చరిత్రని మార్చడంలో కవికి పాత్ర ఉందని కుందుర్తి అభిప్రాయం. కాలంలో జరిగే మార్పుకి కవి కొలమానం కావాలని ఆయన తీర్పు. నేను రాస్తాననీ, నేను సాధిస్తాననీ చరిత్ర ఆశ పడుతుంది – అంటే ఇది కేవలం ఆత్మోత్కర్షగా భావించనక్కరలేదు. ఈ 'నేను' నేటి కవులకు పర్యాయపదం. నా మీద చరిత్ర భారం పెట్టిందనే భావం ప్రతి కవికీ ఉండాలని కుందుర్తి సందేశం.

## 34

ప్రయోజనం తండ్రి
పరమ సౌందర్యం తల్లిగా
పలికే ప్రతివాక్కు రసానంద కల్పవల్లిగా
నా దారి నాది.

సామాజిక ప్రయోజనమే కుందుర్తి కవితాలక్ష్యం. కాని చెప్పే సామాజిక సత్యాన్ని అందంగా చెప్పాలి. ఈ పరమ సౌందర్యం కుందుర్తి శైలిలోని ధారకీ, లయకీ సంబంధించిందిగా అర్థం చేసుకోవాలి. 'రసానందకల్పవల్లి' అనేది ప్రాచీన పదాలమీద కుందుర్తికి గల ఆకర్షణనే చెప్తుందిగాని, ఆ అర్థాన్ని సూచించదు. చమత్కారాన్నీ, వ్యంగ్యాన్నీ, ఉక్తి ప్రౌఢిమనీ, భావ ఉద్దీప్తినీ కవి ఉద్దేశించినట్లు, ఆయన కవితాధోరణినిబట్టి అర్థంచేసుకోవాలి. కాబట్టి కుందుర్తి చెప్పే విషయానికేగాక, చెప్పేరీతికి కూడా ప్రాధాన్యమిస్తున్నాడు. ఇది కుందుర్తి దారి. ఆ దారి తనదైన ఒక ప్రత్యేక లక్షణం కలది.

# కుందుర్తి నగరంలో సూక్తులవాన

రమ్మనినువు ఘట్టిగా అంటే రేపే వస్తుంది శాంతి
కమ్మ కమ్మగా వెదజల్లుతూ తెల్లని మల్లెపూలకాంతి

నేడు బ్రతుకు గాథ నిద్రలో కలిగిన పీడకల
విస్మరించు గతాన్ని
చరిత్రను కరిచిన అనుభవాల వాసుకితో
మధించు ప్రస్తుతాన్ని

శాంతి రెండురకాలు: తనచుట్టూతాను తిరిగేది ఒకటి
యుద్ధాల చుట్టూ తిరిగేది రెండు
భూమ్మీద ప్రాణంతో తిరిగే ప్రతిజీవికోరేది ఒకటే
రెండోది వెనకాల వీపుమీద వుండు

బంగారం పాతిపెట్టినవాడు దొంగ-
బైటకు తీసినవాడు దొర-

మానవత్వం హింసకు తల ఒగ్గదు
మనిషిబలం ఏనాటికీ తగ్గదు-

తిరుగుబాటు కాలానికి కలిసిన చుట్టం
ప్రతి యుగానికీ అంతిమ ఘట్టం-

జడతకు చైతన్యం రాంది
జనతకు విముక్తి లేదు
బలంలేంది ఫలం లేదు-

ఆరంభం అంతంలేని
ఒక ఉద్యమం కొనసాగుతున్నది
మనిషి మనసులోని మంచినీటి జలలకోసం
అందబోతున్న ద్రాక్ష గెలలకోసం-

జీవితంలో చెలరేగిన అశాంతి
శాంతికి సేతువు
మన ఆదర్శాల శివతాండవమే
సరిక్రొత్త శబ్దాల హేతువు

నీ మనసు రైలుపెట్టెలో
దొంగలున్నారు జాగ్రత !

ఆత్మతృప్తి లేని ఆనందం
ఎక్కడ వెతికినా దొరకదు
వెలుగులో లేని సౌందర్యం
చీకట్లో అసలు దొరకదు-

భయపడిన వాణ్ణి చూచి
వెకిలిగా నవ్వే విశ్వం
భయపడనివాడి బానిస-

ఈ దేశం మనది - హిమాలయం మనది
ఇంటింటా పెల్లుబికే చైతన్యం జీవనది-

కాని కవిత్వం ఒకటి ఉంది
కదలనియ్యదు మెదలనియ్యదు
మెత్తగా చేస్తుంది మెదడును
జాలి ఒత్తితో మండిస్తుంది గుండెను-

నిజమైన జనధర్మం పలికే నోరు
లోకంలో కవిది ఒక్కటే
నిజమైన జనధర్మం పలికే తీరు
లోకంలో కవిత ఒక్కటే-

చీకటి యింకా ఉందే అని
వేగుచుక్క వెలగదా ?
ఉదయసూర్యుని ఉర్వీ యాత్రకు
మంచు అడ్డం తొలగదా ? -

కాలం జీవనదిలా పరుగెడుతుంది
మనిషి బ్రతుకు కడిచెడు నీళ్ళు
అవివేకానికి మందులేదు; అనుభవించడం తప్ప
తెలివి ఒక్కటే నదిదాటించే తెప్ప-




# యువభారతి సాహిత్య సమావేశాలు

సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతర సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో గడచిన పదమూడు సంవత్సరాలుగా కృషి చేస్తున్న సంస్థ 'యువభారతి'. మనిషిలో అంతర్లీనంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కావడానికి యువభారతి ప్రతీ నెలా మొదటి, మూడు ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో సాయంత్రం 5 నుండి 8 గంటల వరకూ సాహితీ సమావేశాలు నిర్వహిస్తున్నది. ఈ సమావేశాలకు సహృదయులందరూ ఆహ్వానితులే!

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3